PRSVHO2A161

సాహిత్య ప్రస్థానం
జులై 2015
సంపుటి : 14 సంచిక : 7

# పాలకపక్ష విన్యాసాలు

అటు కేంద్రంలోనూ ఇటు రెండు తెలుగు రాష్ట్రాల్లోనూ పాలనాధినేతల విన్యాసాలు సామాన్యులను అయోమయంలోకి నెడుతున్నాయి. ప్రధానమంత్రి మోడీ యోగా దినోత్సవానికి బాగా ప్రచారం వచ్చేలా చేశారు. అన్ని సమస్యలకు యోగా పరిష్కారమన్నట్లుగా అనుచరగణం దగ్గర నుండి అధికార గణం వరకూ ఆర్భాటం చేశారు. ఈ యోగా ప్రహసనం అయిన వెంటనే వచ్చిన అభియోగాలు కేంద్రాన్ని ఇరకాటంలో పెట్టాయి. నిజానికి నిత్యావసర సరుకుల దగ్గర్నుండి నిరుద్యోగం వరకూ ఎన్నో సమస్యలు భారతదేశాన్ని పట్టి పీడిస్తున్నాయి. ఆ సమస్యల మీద కేంద్రీకరించకుండా యోగాసనాల పేరుతో కాలయాపన ప్రయోజనం ఏమిటి? స్వచ్ఛభారత్ నినాదాలు, యోగా దినోత్సవాలు సామాన్యులకు ఒరగబెట్టేదేముండదు. కార్పోరేట్లకు 'రెడ్‌కార్పెట్' పరిచే ప్రభుత్వాలు ప్రయోజనంలేని విన్యాసాలతో ప్రజలను భ్రమల్లో ఉంచాలనుకుంటాయి. అలాగే తెలుగు రాష్ట్రాల్లో కూడా 'ఓటుకు నోటు' ఉదంతంతో పెద్ద రాద్ధాంతమే చూస్తున్నాం. విభజన నాటి వాగ్దానాలను గాలికొదిలేసి, ఉద్వేగాలను రాజేస్తూ పబ్బం గడపడానికి ఇలాంటి సంఘటనలను పాలకపక్షాలు బాగానే వాడుకుంటాయి. ఇన్నాళ్ళూ తెరవెనక జరిగే వ్యవహారాలు ఒక్కసారిగా బయటపడేటప్పటికీ పాలకపార్టీలు ఎవరికి తోచిన రీతిలో వాళ్లు డొంకతిరుగుడు వాదనలు చేస్తున్నాయి. ఎన్నికల ప్రక్రియను ఒక ప్రహసనంగా మార్చిన పార్టీలు ప్రజాస్వామ్యాన్ని అపహాస్యం చేస్తున్నాయి. ఈ పరిస్థితులలో న్యాయవ్యవస్థ నిష్పాక్షికంగా తన పని తాను చేయాలి. పాలకుల విన్యాసాల, విపరీతాల లోతుపాతులను తెలుసుకునేలా ప్రజాతంత్రవాదులు, రచయితలు ప్రజలను చైతన్యపరచాలి.

..... ..... ....

ప్రసిద్ధ రచయిత, తెలంగాణ సాయుధ పోరాట చరిత్రను తన నవలల్లో నిక్షిప్తం చేసిన దాశరథి రంగాచార్య మృతి తెలుగు సాహిత్య రంగానికి తీరని లోటు. ఉత్తేజకరమైన ఆయన రచనలు తెలుగు సాహిత్య చరిత్రలో బలమైన ముద్రవేశాయి. అవి ఉత్తమమైన మార్గదర్శనం చేస్తాయి. సాహిత్య ప్రస్థానం తరపున వారికి జోహార్లు.

బొమ్మలు : తుంబలి శివాజి, జె.వెంకటేష్, భాస్కర్

## ఈ సంచికలో ...





చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్
ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర,
హైదరాబాద్ - 500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,
ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

## పాలపుంతల కాంతివనం

ఝాన్సీ కె.వి.కుమారి
9010823914



మనిషి నీ ఎజెండా
అయితేనే
పకపకలాడుతుంది
మానవత జెండా

కులం రాకాసి బల్లి
భరత భూమిలో
జొరబడింది
బుర్రల్ని ఎఐ*తో నింపేసింది

మూఢ నమ్మకాలా?
తప్పు తప్పు....మహా విజ్ఞానం
నమ్మించు గురువా,
వద్దంటే డబ్బు

వాడి తలపై
నీ వాడి తలపై నీ కాళ్ళున్నందుకు
సిగ్గుపడు
సిగ్గుపడడమే విప్లవం
**("shame in itself is revolution")**

వాడి కాళ్ళను
మోస్తున్న నీతలతో
రోషాగ్ని జ్వలిస్తేనే
నిచ్చెనమెట్లు కాలి బుగ్గయ్యేది!

నిచ్చెనమెట్లు
లేని భారతం
కోట్ల పాలపుంతలు
ఇలకు దిగిన కాంతివనం

సమానతా
పునాదులపైనే
భారత నిర్మాణం...
భారతమ్మా, జాతిని మేల్కొలుపు !

*(ఎఐ= ఆర్టిఫిషియల్ ఇంటలిజెన్స్= కృత్రిమ - నిజంకాని - మేధస్సు)

## ఏ నిముషానికి...

- తమ్మెర రాధిక
94406 26702



పెరగని ఆయుష్షు
మంచానికి
అంటుకు పోయింది
మృత్యువులా !

కళ్ళు మాత్రం ఆశల
లోకాలకు కావలి కాస్తున్నాయి
తనకక్కడ స్థానం వుంటుందేమో

మంచం క్రింది మందులు
రాలిపోతున్న కలలకు
రాబందు రెక్కలు

దీర్ఘ రోగికి
ఇంట్లో వాళ్ళంతా
యాత్రీకులే తనే జీవచ్ఛమని ఒప్పుకోక
రివ్వున రాని గాలి
ఫెళ్ళున కాయని ఎండా
లోపలికి రావడం మూసిన
కిటికీలకసాధ్యం

మూడు కాలాలూ
మురిక్కాలవల పాలు
పక్కెత్తేసిన మరుక్షణం

బొమ్మందుకే పాడుతోంది
తత్వమసీ అంటూ
భయం పీకనులిమేసీ !

## జూన్ నెల పురస్కారాలు





**అవాంఛితం**
కథకు: రూ.700/-
రచయిత : **నందవరం కేశవరెడ్డి**

**ఒలికిన అమృతం**
కవితకు : రూ .500/-
రచయిత : **బి. రవికుమార్**

సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి

వ్యాసం : **మానవ సంబంధాలకై ఎలుగెత్తిన బాగోతులాయన** రచయిత : **కరణం శ్రీనివాసులు రెడ్డి**



ఈ రచయితకు 'కర్లపాలెం రుక్మిణమ్మ స్మారక పురస్కారం రూ.500/- అందజేయబడుతుంది

పాఠకులు తాము చదివిన కవితలు, కథలు, వ్యాసాలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. సీనియర్, ప్రసిద్ధ రచయితల రచనలు కాక ఔత్సాహికులను, ఇటీవల రాస్తున్నవారిని ప్రోత్సహించడమే ఈ పురస్కారాల ఉద్దేశ్యంగా గ్రహించగలరు.

- ఎడిటర్

కథ

# సవాలు



- డా॥ యస్. రామచంద్ర
9293924501

కళ్ళు తెరిచి చూస్తే కొత్త ప్రపంచం కనిపిస్తుంది. మనసు విప్పి ఆలకిస్తే కొంగ్రొత్త నినాదం వినిపిస్తుంది

కోగంటి అగ్రహారం రాగమ్మ ఇంట్లో మైలవచ్చింది. పేరిశాస్త్రి కైవల్యం పొందగా వైకుంఠ సమారాధనకు ముందురోజు ఒక పురోహితుడు - యాజులు పంపగా రాగమ్మను కలిశాడు. పేరిశాస్త్రి నిస్సంతుగా కన్నుమూశాడు. ఆ పనికో, ఈ పనికో పలికే దిక్కూ కరువయింది రాగమ్మకు - సంభారాలు సమకూర్చేందుకు.

వైదిక వాదుల కర్మకాండ జటిలం, వెంద్రుకవాసి తప్పినా చచ్చిన వాడికి మోక్షం దూరమని విశ్వాసం. మాసికమని, సాంవత్సరికమని అస్తికల నిమజ్జనమని, వైకుంఠ సమారాధనకు పురోహితుల కీయవలసిన దానాలని పుటల కొద్దీ వైదిక కర్మకాండను నింపేశారు పూర్వీకులు. శ్రాద్ధ కర్మలైనా, ఉత్తర క్రియాలైనా సంతర్పణ తప్పదు.

"నియంత్రణోత్సవాః విప్రాః" బ్రాహ్మలు విందు పిలుపును "సంతాప దినాలు"గా కాక "సంతర్పణ" దినాలుగా భావిస్తారు.

సత్యనారాయణ వ్రతానికిచ్చే జాబితాకంటే పేరిశాస్త్రి శ్రాద్ధకర్మ జాబితా పెద్దది. అందులోకి అదనంగా గోదానమొకటి చేరింది. భోక్తలకీయవలసిన మధు పర్కాలు, సంభావనలు ఉండనే ఉన్నాయి. భర్తపోయాక అమెకిక మునుపు ధరించే వస్త్రాలు పనికిరావు, కట్టుడుకు, విడుపుకు రెండైనా కావాలి- అంచులూ, ఆర్భాటాలు లేనివి.

ఓ బస్తా టెంకాయలు, కట్ట దర్భలు, అయిదు పట్టాలు తమలపాకులు, బుట్టెడు వక్కలు, వంద కురిడీలు, అయిదు పళ్ళు, నువ్వులు, గెల అరటిపళ్ళు, మరో అయిదు రకాల పళ్ళు, నవధాన్యాలు, రెండు కేజీల నెయ్యి, అయిదు లీటర్ల పాలు, పొడవైన సీసా తేనె - ఇలాంటివే చిన్నా - పెద్దా సరుకులు చిన్నపాటి ఒంటెద్దు బండి సరుకు. మొగి విరిసి, కరకు కూడని అరటి ఆకుల కట్ట, పెద్ద పురోహితుడికి చెప్పులు, మరచెంబు - మొత్తం రాగమ్మను వివస్త్రను చేసి మోదినట్లవుతుంది వైకుంఠ సమారాధన తంతు ఖర్చు.

తృణమో - ఫణమో సంభావనల్లో వెనకేసిన పేరిశాస్త్రి రూకలు ఆయన మంచమెక్కిన నాటి నుంచి మంచం దిగే నాటికి చెల్లిపోయాయి. ఇక రాగమ్మ ఈ శ్రాద్ధ కర్మల్ని సక్రమంగా గట్టెకించాలంటే పెద్దల కాలం నాటి పెంకుటిల్లు తాకట్టో, అమ్మకమో చేస్తేనే జరుగుతుంది.

ప్రజల మూర్ఖత్వాన్ని తమ లబ్ధి వైపు లాక్కుపోగలిగింది. గృహస్థుల నాడిని పట్టుకొని వాళ్ళను అమాయకుల్ని చేసి తమ

పిడికిట్లోకి తెచ్చుకోగలిగింది. పురోహితులే, గ్రహాల గురించి, గ్రహణాల గురించి చెప్పి ప్రజల్ని మూర్ఖ శిఖామణుల్ని చేయ సమర్థులు వారు. చివరకు చచ్చిన వారి భార్య జుట్టును కూడా మిగల్చరు.

జంఘాల శాస్త్రి శ్రోత్రియం వీధి గుండా వెడుతూ పేరిశాస్త్రి ఇంటి ముందు ఇంకా సూటికిరాని ఆవు పెయ్యని చూశాడు. దాన్ని ఓ కొరడుకు కట్టి వేసి దానిముందు నాలుగు చొప్పదంట్లు, అరకట్ట వరిగడ్డి వేసి ఉన్నారు. వాటిని మార్చి మార్చి కొరుకుతూ ఉందది.

ఈ మధ్యనే పేరిశాస్త్రి కాలం చేశాడని శాస్త్రి విని ఉన్నాడు. బహుశ కర్మకాండ సన్నాహమై ఉంటుందని ఊహించుకున్నాడు.

పెద్ద పురోహితుడు యాజులు పెద్దంచు పంచెకట్టుతో, అదే అంచు వలెవాటుతో హడావిడిగా పేరిశాస్త్రి ఇంటివైపు రావడం గమనించాడు జంఘాలశాస్త్రి. యాజులు ఎదుటవడ్డాడు. ''వరువాతలేచి ఈ వరాటకుడి కంటబడ్డానేమిటి? ఒట్టి జగడాల గొండి. గండ భేరుండం లాంటివాడు, మాటల తికమకతో మాడు పగలదీస్తాడ''ని పక్కకు తప్పుకొని పోబోయాడు.



"యాజులుగారికి పెద్ద అడపము దొరికినట్లుంది, చూసి చూడనట్లు తప్పుకుపోతున్నారు. నేనేమీ భాగమడగను, పోట్లగిత్తనుకాను" అన్నాడు జంఘాల శాస్త్రి.

"అవతల అవసరప్పనులండి, అయప్పకు సుమంగళీత్వం తొలగించి తదుపరి తతంగం జరిపించాలి, ఇప్పటికే పొద్దు నడినెత్తి మీదకు వచ్చింది, భోక్తలు, వాళ్ళూ వచ్చారో లేదో చూచుకోవాలి, సంభారాలు సర్దాలి, మీతో తగాదా పడలేను, నన్ను వదలండి" యాజులు.

"నేనేమి మిమ్మల్ని గాటికికట్టి గడ్డివేయడం లేదు, బయట ఆవు పెయ్య కనిపిస్తే పేరి శాస్త్రి వైకుంఠ సమారాధనకని అనుకున్నాను. రాగమ్మ రోగం కుదర్చకుండా వదలరు కదా! తిండికే దేబిరించే కుటుంబం గోవుల్ని, స్వర్ణాల్ని దానమిమ్మనటం – న్యాయమా! యాజులుగారూ?"

"ఓరి నీ పిండం పిల్లికి పెట్టా! ఊరకనే కర్మాంతరాలు తీరుతాయటోయ్ ! నీలాంటి కర్మ చండాలుడికి అక్కర్లేదుకాని, పునర్జన్మంటూ ఒకటి ఏడ్చిందికాదూ? వైతరణి దాటేందుకు గోదానం లేక అవుతుందా? నన్నొదులు, నీకు బహుపుత్ర లాభం" యాజులు.

"భార్యే లేని వాడికి బహుపుత్రయోగమా? యాజులు గారూ! మీకు మతి మోకాలికిందికి జారినట్లుంది, ఇప్పుడిక బహు పుత్ర లబ్ధికి నేను మళ్ళీ మనువాడాలా? ఏమి వరమిచ్చారు యాజులు గారూ?" శాస్త్రి

"నన్నొదులు, నీశ్రాద్ధకర్మలు ఉచితంగా శాయిస్తాను" అంటూ యాజులు విసవిస నడిచాడు.

"వీడోకులభ్రష్టుడు, శిఖాయజ్ఞోపవీతాలులేవు, వితండ వాదంలో దిట్ట" యాజులు లోపల్లోపల పళ్ళు పట పట లాడిస్తూ గొణిగాడు.

క్రాపులో కనపడీ – కనపడని పిలకతో హడావిడిగా కూచిభోట్ల రవిశర్మ రాగమ్మ ఇంటివేపు ర్యాలీ సైకిల్‌లో – జంఘాలశాస్త్రిని చూసి ముఖం చాటెయ్యాలని వేగం పెంచాడు. పట్టుపడకుంటే పదివేలన్నట్లు.

శాస్త్రిది గద్దచూపు. "ఓయ్ పిల్ల శర్మా! ఎక్కడికీ హడావిడీ?"

''చచ్చన్రో! ఆగితే రొచ్చు, ఆగకపోతే పుచ్చు, పెద్దముండావాడు", అనుకొని సైకిల్ వేగానికి సడెన్ బ్రేక్ వేసి పంచె చైన్‌లో ఇరుక్కొని క్రింద పడబోయి శాస్త్రి చేయూతతో నిలదొక్కుకున్నాడు.

''ఎప్పటికైనా మీవేగానికి ముకుతాడు వేసేది నేనే సుమా'' అన్నట్లు శాస్త్రి శర్మవైపు చూశాడు.

"అయ్యా! నీకు దండాలు, యాజులు గారు ఉద్దండుడు, ఆలస్యమైతే అరికాలు మీద నిలబడి కూకలేస్తాడు, నన్నొదిలితే ధన్యుణ్ణి" శర్మ.

"నిన్నొదలక అట్లే ఉంచుకుంటే గారెలు, పాయసాలు, పంచభక్ష్యాలు పెట్టి నేనేడ నిన్ను సంతృప్తి పరిచేను? ఇప్పుడే యాజులు గారు పేరిశాస్త్రి యింట దూరేడు, సరే ! ముంగిట్లో కొరడుకు కట్టిన అవెవరికి?" శాస్త్రి.

"ఇంకెవరికి? యాజులు గారికే "ధేనుం దద్యాత్ సువర్ణంచ గ్రహాంశ్చపి ప్రపూజయేత్" అన్నాయి శాస్త్రాలు, పేరిశాస్త్రి ప్రేతాన్ని వైతరణి దాటించాలంటే ఆయనే ఘనాపాటి. ఆయన మంత్రాల ఉద్ఘోషకు వైతరణి దారిచ్చి పేరిశాస్త్రిని గట్టెకిస్తుంది" శర్మ.

''ఆయన చచ్చి శ్రాద్ధ కర్మలకి ఇంటి వాళ్ళు సన్నద్ధమవుతూంటే ఇప్పుడు ఆవుతోక పట్టుకొని వైతరణి

దాటడమేమిటి? ఆయన ప్రేతాత్మ ఇంకా దారిలోనే ఉందా? యాజులు ఆవు మెడకు తలుగు తగిలించి తోలుకుపోతాడా? యమకింకరులు రానిస్తారా?" జంఘాల శాస్త్రి.

"అయ్యా ! శాస్త్రి నాయంతో శాస్త్రాల్ని తల్లక్రిందులు చేసి వ్యాఖ్యానిస్తున్నారు, నిజమా - అబద్ధమో? మాకిది భుక్తినిస్తుంది, ఆచరిస్తున్నాం. అనువంశిక వృత్తి, వదులుకొని మరోమార్గం వెదుక్కోలేం గదా!"

"అరె అబ్బీ! పెద్ద వయసువాణ్ణి, అజ్ఞానిని, ఏమనుకోకుండా జవాబు చెప్పు. నీ నమ్మకాలు నీవే, కాని ఒక ప్రశ్నకు ఒక జవాబు ఉండాలికదా! పేరి శాస్త్రి పెళ్లితంతు యాజులుగారేనా జరిపించింది? మరి ఆయన చదివిన పెళ్లి మంత్రాలకు బలముంటే శాస్త్రిగారు ఇంతలోనే టపా కట్టడమేమిటి? ఆమె పాపం వితంతు కావడమేమిటి? జీవేమశరదశ్శతమ్" అని శాస్త్రి ప్రతిజ్ఞ చేయించాడు కదా! మీ మంత్రం ఫలించలేదా?"



"అయ్యా! నేను పిల్ల కాకిని, ఇంకా ఉండేలు దెబ్బలు తినలేదు, భోక్తగా వచ్చాను, పని ముగించుకుని, సంభావనలుచ్చుకుపోతాను, మీ మాటలు వింటుంటే ఇప్పటికిప్పుడు చార్వాకుల్లో కలిసిపోమ్మనేట్లున్నారు, మహానుభావా! నన్నొదలండి, యాజులు అగ్రహోదగ్రుడై శపించినా శపించవచ్చు" అని శర్మ తప్పించుకున్నంత పని చేశాడు.

వంద సంఖ్య దాటిన ముత్తయిదువుల మధ్య రాగమ్మ అధో ముఖియై, దౌర్భాగ్యాన్ని నిందించుకుంటూ, దారిద్ర్యాన్ని తలపోసుకుంటూ రేవు దారి పట్టింది. ఒడలంతా పసుపుతో, ముఖమంతా కుంకుమతో పులిమారు. 'ఇది ఆఖరి పూత' అని కాబోలు.

శాస్త్రి రాగమ్మ యెదుట పడ్డాడు. ఏ పోలేరమ్మకో మేకపోతును బలి యిచ్చేందుకు తీసుకపోతున్నట్లుంది. శాస్త్రి మనస్సు కుతకుత ఉడికింది. మనిషి తాను కోరుకున్న రీతిలో బతకనివ్వని సమాజం. మతం, సంప్రదాయం అనేవి బలపడి మనిషి జీవితాన్ని కుళ్ళ బొడిచి, నిర్వీర్యం చేసి సొంత బతుక్కి గండి కొడుతున్నాయి. రేవుకు పోతున్నపుడు ఒక పరుషుడు సాంత్వన వాక్యాలు పలకడం తగునో, తగదో అని తటపటాయిస్తూ శోక మూర్తి రాగమ్మను, విరాగంలో మగ్గిపోతున్న రాగమ్మను పలకరించాడు. శాస్త్రిని చూడగానే రాగమ్మ పైట సర్దుకుంది.

"ఏమిటి? మీరంతా ఈమెను రేవుకు తీసుకుపోతున్నారా? మీకు దుఃఖంగా ఉందో, ఎగతాళిగా ఉందో నాకైతే తెలీదుకాని, పేరిశాస్త్రి మరణానికి, ఈమెను రేవుకు తీసుకపోవటానికి ఏమిటి సంబంధం? శాస్త్రిని కన్న తల్లి - తండ్రి, అప్ప - చెల్లి, అన్న - తమ్ముడు అంతా బాగుండాలి. నిన్నగాక మొన్న ఇంటి చాకిరీకి వచ్చిన ఈమెను - గుండు గొరిగించి, గాజులు వగల గొట్టి, నుదుటి బొట్టుతుడిచి, తాళి తెంపి, మెట్టెలూడబెరికి, తెల్ల చీరె చుట్టి - ఘోరం ఘోరాతి ఘోరం, ఏమి సంప్రదాయమో? విదేశాల్లో ఈ విధానం లేనప్పుడు మనమెందుకు పాటించాలి. ఎన్నింటికో వాళ్ళను ఆదర్శంగా తీసుకుంటామే, మరి దీనికెందుకు వాళ్ళు ఆదర్శం కారు?

పెళ్ళికి ముహూర్తం , శోభనానికి ముహూర్తం పెట్టిన పురోహితులకు శాస్త్రిగారు అర్ధాయుష్కులని తెలీదా? మిధునలగ్న ప్రభావాలు పురోహితులకు తెలీదా? లగ్నాలు, రాశులు, జాతక చక్రాలు, ముహూర్తాలు, మంత్రాలు శాస్త్రి గారిని రక్షించలేకపోయాయి. వాటిని పురోహితులు ప్రతిఘటించ లేకపోయారు. ఈ కుత్రదారుల్ని "జ్యోతిర్విద్యార్ణవ" బిరుదంతో సత్కరిస్తారు. చంద్రునితో విశాఖ నక్షత్ర సమాగమం చెప్పగలరు గాని ఒక గృహిణి ఎప్పుడు, ఎందుకు వైధవ్యం పొందుతుందో చెప్పరు, చెప్పలేరు, వీళ్ళదంతా శ్రుత పాండిత్యం. "కాని ఈమెను రేవుకు పంపేందుకు శాస్త్రాల్లో శ్లోకాలు గట్టిగా అచ్చువేయబడ్డాయి."

"బ్రాహ్మడి పుటక పుట్టి ఇవేం ప్రశ్నలయ్యా! ఈ కర్మకాండలు మేం కల్పించామా? "ఆదిత్యే విధవానారీ" అని స్త్రీ ఆదివారం ఋతుమతి అయితే విధవ అయిపోతుందని శాస్త్రం. మేం ఆనాడే అన్నాం. నువొక్కడివి అరచేయి అడ్డు పెడితే సంప్రదాయాలు ఆగిపోతాయా?'' ముత్తయిదువుల ఎదురుదాడి.

చావు పుట్టుకలు సహజం. ఎవ్వరూ ఇక్కడే శిల కట్టుకుని కూర్చొని ఉండరు. ఈ కర్మకాండ కాగితాల్లోని రాతలు కల్పితం. మీరంతా వెర్రిపప్పలు. "వైశ్యానరః ప్రవిశతి అతిథిర్బ్రాహ్మణో గృహమ్" బ్రాహ్మలకు కోరినంత భోజనం ఇవ్వకుంటే యజమాని భార్య, పిల్లలు, పశువులు అన్నీ మటాష్ అని భయపెట్టింది ఉపనిషత్. అంతేకాదు ఆ అతిథికి శాపమిచ్చే శక్తి ఉంటుందని మరింతగా భయపెట్టింది. ఇలా భయపెట్టడం వల్లనే మీరంతా నియమాలకు కట్టుబడిపోయారు. ఒకవేళ

పాటించలేదో, ఏమీకాదు, మీ తలలోని తెల్లవెండ్రుకను కూడా ఆ శ్లోకాలు కదిలించలేవు.

ఈ పురోహితులు చాలా నేర్పరులు. ఈ రోజు దేవతల నిమిత్తం రేపు పితరుల నిమిత్తం భోజనం పెట్టు, పుణ్యకార్యమైనా, పాప కార్యమైనా, పుట్టినా, చచ్చినా భోజనం పెట్టు అని ప్రజల్ని మెట్టశాస్త్రమనే కర్రతో బెదిరించారు. ఇక ఈ వెర్రి పీనుగలు కొంపలు, భూములు అమ్మి పురోహితులకు సంతర్పన. దశ కర్మలతోనే తమ కొంపలు కూల్చుకున్నారు. శ్రాద్ధం నాడు సంతర్పణ ఏర్పాటు చేయకుంటే మృతునికి ఉత్తమగతి ఉండదని, మృతుని ఇంట్లో హాహాకారాలు ప్రతిధ్వనిస్తున్నా భోజన భట్టుల ఎదుట విస్తళ్ళు పరచవలె. వీళ్ళ పొట్టలు నింపకపోతే చచ్చిన వాడికి స్వర్గానికి పాస్‌పోర్ట్ దొరకదు.



ఈ యాచక ప్రవృత్తే దేశాన్ని కొర కాకుండా చేసింది. అన్నదానం, వస్త్రదానం, గోదానం, ద్రవ్యదానం, భూదానం మొదలగునవి ఎప్పుడివ్వాలో కుక్కుట శాస్త్రంలో చక్కగా తయారుచేసిపెట్టారు. గోడ, దెబ్బ, చెంప దెబ్బ రెండూ అమాయక ప్రజలకే "విప్రాయ దక్షిణాందద్యాత్" అని పురోహితుడు మూర్ఖుడైనా సరే భగవంతుని అంశే అని అతడి చరణక్షదకాన్ని భగవంతుని చరణోదకంగా భావించాలని శాసనాలు, పాటించకపోతే శాపాలు, విప్రుని పాదోదకం, సాలగ్రమోదకంతో సమమట. "బ్రాహ్మణాః మమదేవతాః" అని, భూసురులని వాళ్ళని ఆకాశానికెత్తి నెత్తిన పెట్టుకొన్నారు.

ప్రజలకు రోగ నివృత్తి వైద్యునితోకాదు, తాయెత్తుతో, లేదా సంతర్పణతోనే, గ్రహాలన్నీ వాళ్ళ మాటల ప్రకారమే నడచుకుంటూ ఊడిగం చేస్తాయట.

''ఇదిగో రాగమ్మా! ఈ ముత్తయిదువులు, ఆ పురోహితులూ ఇరువురు ఒకటే, నిన్ను నట్టేట ముంచే వాళ్ళే. మీ ఇంటి ముందు కొరడుకు కట్టి ఉంచిన ఆవును చూశాను, నీవు దాన్ని యాజులుకు దానంచేస్తే మీ ఆయనకు స్వర్గప్రాప్తి ఉంటుందని రాసింది ఈ పురోహితులే. ఈ బడుగులు గడ్డికోసి దాని ముఖాన వేస్తారా? ఏ కటికవాడికో అమ్మి సొమ్ము చేసుకుంటారు. నిన్ను నమ్మించేందుకు ఇదిగో 'దాన దీపిక' గ్రంథంలోని ఈ శ్లోకం చదువుతారు:

ధేనుంచ యో ద్విజే దద్యాత్ అలంకృత్య పయస్వనీమ్

కాంస్య వస్త్రాది భిర్యుక్తా స్వర్గలోకే మహీయతే" పాడి ఆవును అలంకరించి, కంచుపాత్ర వస్త్రాదులతో బ్రాహ్మడికి దానం చేస్తే స్వర్గలోక ప్రాప్తి, గౌరవము దక్కుతాయి.

"యమద్వారే మహా ఘోరే కృష్ణా వైతరణీ నదీ

తాం సంతర్తుం దదామ్యేనాం కృష్ణాం వైతరణీంచగామ్" అని సంకల్పం చెప్పుకొని పాలిచ్చేది, కొమ్ములతో కుమ్మనిది, పైగా ఆ కొమ్ములకు బంగారు కుప్పెలట, గిట్టలకు వెండి తొడుగులట, పాలు పితుక్కోవడానికి కంచు పాత్రట, దానికి కుడితి పచ్చగడ్డి, చిట్టు, తవుడు ఖర్చులకు కొంత రొఖ్ఖం కూడా ఇవ్వాలట.

"సౌవర్ణం నిర్మితాం మూర్తిం తుభ్యం సంప్రదదే ద్విజ!" అనాలి దానం చేస్తూ

నాకు తెలియక అడుగుతున్నాను, స్వర్గలోకం ఎక్కడుంది? చూసి వచ్చిన వాణ్ణి ఒక్కణ్ణి చూపించు.

ఇతర దేశాల నక్షత్ర శాస్త్ర పండితులు టెలిస్కోపు సహాయంతో గ్రహ, నక్షత్రాలు సూక్ష్మాతి సూక్ష పరిశీలన చేస్తూంటే మన మిడిమేలపు జ్యోతిష పండితులు ఇల్లు కదలకుండా లాభనష్టాలు, గణిస్తూ ఉన్నారు. "సమ్యుఖేచార్ధ లాభశ్చవామే చంద్రే ధనక్షయః" అమెరికా వాళు ళ్ళ చంద్రలోకం చేరుకొని అక్కడి నుండి చంద్ర శిలలు తీసుకవస్తూంటే మనం మాత్రం ఇంకా "చతుర్థీ చంద్రాయ నమః" అని ఇక్కడి నుండే చంద్రునికి అరటిపండ్లు చూపిస్తూ, పెరుగు సమర్పిస్తున్నాం. విదేశీ శాస్త్రజ్ఞులు చంద్రునిపైకి వెళ్లి, అక్కడి లోయలు, శిఖరాలు చూసి ఛాయా చిత్రాలు తయారు చేస్తూ, అందులో నీటి చాలు, జీవశక్తిని పరీక్షిస్తూంటే మనవాళు ళ్ళ శశాంకుడు, మృగాంకుడు అంటూ చంద్రుడిలో కుందేళ్ళు, జింకలు వెదుకుతున్నారు. మనల్ని పట్టి పీడిస్తున్న మూర్ఖత్వమనే రాహువు పట్టునుండి మనల్ని విడిపించుకున్నపుడు కదా మన నిజమైన విముక్తి శారీరక, మానసిక, హింస, ఈ హింసకు ఆనవాళ్ళు కన్నీళ్ళు ఇది మనకు జరిగినపుడు బాధైతే, అది ఇతరులకు బాధే కదా! ఇంత బాధాకరమైన ఆచారాన్ని సమర్థించాలా? మానవత్వం మసకబారిన పైశాచిక చర్య "శాస్త్రి వచనాలకు కొందరు లోలోన తిట్టుకున్నారు. కొందరు శపించారు, కొందరు ఛీ! ఛీ! ఛా! ఛా! అన్నారు. మరికొందరు ఈ నాస్తికుడికి మంచి బుద్ధి నీయమని మొక్కుకున్నారు.

వయసులో పెద్దావిడ, ముసలి ముత్తయిదువ శాస్త్రిని ఛడామడా తిట్టి "మహా జనో యేనగతః స పంథా" పెద్దలు నడిచిన మార్గమిది. దీన్ని కాదనేందుకు మనమెవరు? ఒరే! జంఘాలు! నీకు మతిభ్రమించి అరికాలుకు చేరింది. రాగమ్మను

## నానీలు

- కె.సరస్వతి
8106391580



సకల మతాల సారాంశం
మానవత్వం
పెనుగులాటలో
జారిపోయిందెక్కడో

అవనితల్లి ఆశగా చూస్తోంది
తాను పరచిన గడ్డి చీరపై
చెట్ల బొమ్మ
ఎవరు గీస్తారని

ఎంత దులిపినా
బూజు పడుతూనే వుంది
సంకుచిత భావాల సాలీడులు
పుడుతూనే వున్నాయి

తలగడ
అతి మెత్తనిదే
కానీ అవసరమైతే
ప్రాణం తీయగలదు

పాపం పిచుక
అని జాలిపడుతున్నాది
చిల్లర కొట్టు
తానూ మాయమైపోతుందని తెలియక

పైకి ఎగిరెగిరి
హెచ్చరించాయి కెరటాలు
వినలేదు
తీరం చేరాయి శవాలు

---

పునిస్త్రీగా ఉంచితే ఈ పాడులోకులు పాడు చెయ్యకుండా ఉంటారా? అరికాళ్ళ కింద చంద్ర నిప్పులు పోస్తారు. నిప్పు నెన్నాళ్ళు తొక్కిస్తూ ఉంచుతాం? ఏదో ఓ మూల పడి, పదిళ్ళలో యాయావరమెత్తి, వంటక్కగానో, మరోలానో బతుకీడ్చికన్ను మూస్తది. జుట్టా- బొట్టూ తీయకుంటే వీధుల్లో తిరగనిస్తారా? "జీవో జవస్య భక్షణయ్" చిన్న చేప పెద్ద చేపకు ఆహారం. అంతెందుకు - నీకు పెళ్ళాం లేదు, బిడ్డా గడ్డా లేక ఇలా గరుడ స్థంభంలా ఎదిగావు, ఏవో బుక్కులు రాసి వెలగబెతున్నావటగా, రాగమ్మను కట్టుకో, ఏలుకో, నీబడాయి బయటపడుద్ది' అంది.

శాస్త్రి బుర్ర గిర్రున తిరిగింది. "శకునాలు చెప్పడం కాదు, పాటించడంలో నిజాయితీ బయటపడాలి. వంద మాటలు చెప్పడం కాదు, ఒక్కమాట మీద నిలబడాలి. "గ్రహాలు అగ్రహిస్తే నీకు గ్రహణం తప్పదు. రోశమ్మక్కకు సమాధానం చెప్పవేం?" ముత్తయిదువులంతా తనను కావు కావు అని కాకుల్లా పొడవడం శాస్త్రి విన్నాడు. రాగమ్మ నిశ్చేష్ట అయింది. "ఏది జరగాలో అదిగాక, ఏదేదో జరుగుతోంది. నా జీవితం నాది, ఈ వీధి నాది, ఈ వీధి మందికి నా జీవితాన్ని శాసించే అధికారమేల?" రాగమ్మ.

ఒకవైపు సంప్రదాయం, మరొకవైపు తిరుగుబాటు. రెండు తక్కెడ సిబ్బులు ఖాళీగా ఉన్నాయి. ఒక్కడు శాస్త్రి, వంద మంది ముత్తయిదువులు. ఒక్క తుపాకీ పేలుడుకు కాకులన్నీ కకావికలం కావాలి అంటే శాస్త్రి రాగమ్మ చేయినందుకోవాలి. ఈ కాకులు రేపు తమ మురికి ముక్కులతో శాస్త్రిని, రాగమ్మను పొడవవని గ్యారంటీ ఏమిటి? పొడవనీ, పొడిచి పొడిచి మొద్దుబారతయి ముక్కులు.

ఆవు ఎండు చొప్పమేస్తోంది. యాజులు ఆవు తనదేనని లొట్టలు వేస్తున్నాడు. కర్మకాండకు తెచ్చిన సరుకు ఆరు నెలలకు సరిపడా ఉంది. అందుకైన ఖర్చు రాగమ్మ యెదుట వెక్కిరిస్తోంది.

పెద్ద ముత్తయిదువ విసిరిన సవాలుకు జవాబు ఏది? రాగమ్మ పైట సర్దుకుంది, జంఘాల శాస్త్రి చేయందుకున్నాడు.

యాజులు, శివశర్మ, భోక్తలు పిలకలు దులుపుకుంటూ, పళ్ళు పట పట లాడిస్తూ, బిళ్ళగోచీలు సవరించుకుంటూ ఎవరిదారి వాళ్ళదిగా సచేల స్నానానికి పరుగు, పిదప కాలం! పిదప బుద్ధులు! బ్రాహ్మణ్యం మంట కలిసింది. ఇంతకింత అనుభవిస్తావ్. "ప్రాప్త కాలేన జీవతి" ఆయువు తీరితే అడ్డంగా నడక, రవరవాది నరకాలకు పోతాడు" అని నీళ్ళలో మునకలు వేశారు.

సూర్యుడు తనగతి మార్చుకోలేదు, యధావిధిగా తూర్పున్నే ఉదయించాడు. ప్రపంచమంతా మేల్కొన్నపుడు మనం నిద్రపోకూడదు.

ఎదెటి మేలును కోరి / కదము కడిపెడి వారి
విధము మెచ్చుము రోరి - ఓ జంఘమయ్యా !

జనవిజ్ఞాన వేదిక జరిపే సభలోని మైకు మోగుతోంది పెద్ద శబ్దంతో

## ఒక జీవన సందర్భం..

- జంధ్యాల రఘుబాబు
9849753298



నా మస్తిష్కం
నన్ను ఆజ్ఞాపిస్తుంది హెచ్చరిస్తుంది
నా పాట నన్ను గర్వపడేలా చేస్తుంది
కొందరికి కన్నీళ్ళు తెప్పిస్తుంది
అందులోని శబ్దాలు
కొందరికి కఠినంగానూ
ఇంకొందరికి అపశృతులుగానూ
వినిపించవచ్చు

కానీ
అవి రెక్కలు విప్పిన పక్షులు
ఎన్నో నదుల్ని సముద్రాల్ని దాటి
శ్రమజీవిని తాకి
సార్థకతను తమకు తాము తెచ్చుకుంటాయి
ఆ పాటను
అందరూ ఇష్టపడాలని
అనుకోను ఆశించను
అది చేరవలసిన చోటికి
చేరితే చాలు

నా సఖుడి గానమే
నా ఆనందం
నా విధి!
అవిశ్రాంతంగా కష్టజీవి శ్రమను
గానం చేయటంలోనే
నాకు విశ్రాంతి
నాబాటలో క్రాంతి అతనే

నా పూదోటలో అందమైన
పుష్పం అతనే
స్వేద మూర్తి
శాశ్వత కీర్తి
సదా నా మార్గదర్శి
నా జీవన స్ఫూర్తి అతనే

---

## ఆర్తి

- శ్రీపాది రామచంద్రయ్య
99121 47336



భూమాత వట్టిపోయి
పాయసంలా మా నోట్లో
ఎండ్రిన్, నొవాక్రానులను కొడుతుంది
బి.టి. విత్తనాలు
మా బతుకు పొలంలో
పల్లేరు కాయలు మొలిపిస్తూ
వధ్యశిలకు నడిపిస్తూ
ఉరికొయ్యలను మిగిలిస్తున్నయి
విద్యుత్ మాతో దాగుడు మూతలాడుతున్నా
రుధిరమే ఇంధనంగా చేసి
స్వేదము సుధగా మార్చి
పండించిన ఫలసాయం
రాబందులకు ఎరవుతుంది
ప్రకృతే పెనుశాపంగా మారి
జీవితాన్ని బానిసగా చేసినప్పుడు
మా కడుపులో మంట ఆర్పటానికి
మా కడుపునే అంగట్లో సరుకును చేసి
వారి రాతైనా బాగుంటే చాలని
ఆశపడుతూ సర్పాలవుతున్నాం

జగత్తునిండిన వామనునిలా
మా ఉపాధిని
యంత్ర భూతాలు స్వాహాచేస్తున్నా
పాతాళానికి తొక్కబడ్డ
బలిలా చూస్తున్నాం
మా గోస కనలేని వినలేని
ధృతరాష్ట్రుల పాలనలో

మా బ్రతుకులు...
శ్రమ... సమస్తం దోపిడీ దోపిడీ
మా శవగంధాన్ని రాజకీయం చేసి
పబ్బం గడిపేవారే...
అఖరికి
మా అశుద్ధాలు.... అక్కరకొస్తాయంటే
రాజకీయం చేసేవారే కాని
మానోట్లో
నురగలు...
మెడకు తాడు...
ఇనుప పట్టాలపై దేహాల ఖండాల గూర్చి
ఆలోచించరేం...?
అన్నం పెట్టే అన్నదాతల
ఆర్తి తీర్చరేం...?

# చిన్న కథ శక్తి

- ఉదయ మిత్ర
9985203376



**మొదట్లో చిన్న కథ మౌఖిక రూపంలో ఉండేది. ప్రజలు అనేక కూడళ్లలో చెప్పుకునే తమ తమ అనుభవాలే కాలక్రమేణా కొంత కల్పనలు జోడించుకు కథలుగా మారేవి. అయితే అప్పుడుగాని ఇప్పుడుగాని కథకున్న ప్రాథమిక సూత్రమేమంటే, అతి తక్కువ టైములో తమ అనుభవాల్ని ఎంత ఉత్కంఠగా మల్చగలరనేదే పరీక్ష.**

'కథను చూపించు... చెప్పకు **(Show... not tell)**' – చార్లెస్ డికెన్స్ చిన్న కథ చరిత్ర చాలా పెద్దది. గతంతో పోలిస్తే ఇపుడది మరింత పుంజుకొని, రచనలో పోటీకి సిద్ధమైంది. పత్రికల అంచనాల ప్రకారం ఇపుడది 'పునరుజ్జీవనం' పొందిందని, మార్కెట్ విలువ కూడా పెరిగిందని అంటారు... కాని... చిన్న కథ ఎప్పుడైనా కనుమరుగైందా? అన్నదే అసలు ప్రశ్న?

చిన్న కథలోని విశేషమేమంటే దానిలో అందరి భాగస్వామ్యముంటది. అసలది ఏర్పడకముందే.. ప్రజల హృదయాలలో జ్ఞాపకాల తెరలుగా, సజీవపు పొరలుగా, మెరుపులలో రణాలుగా నిల్చి ఉండేది. కావలిస్తే... కథా సరిత్సాగరం, ఇలియట్, అరేబియన్ నైట్స్, అవాల్టి సృష్టికర్తలనడగండి. ప్రజల హృదయాల్లో కథలెంత సజీవప్రవాహంలా కదిలాయో తెలుస్తుంది.

మొదట్లో చిన్న కథ మౌఖిక రూపంలో ఉండేది. ప్రజలు అనేక కూడళ్లలో చెప్పుకునే తమ తమ అనుభవాలే కాలక్రమేణా కొంత కల్పనలు జోడించుకు కథలుగా మారేవి. అయితే అప్పుడుగాని ఇప్పుడుగాని కథకున్న ప్రాథమిక సూత్రమేమంటే, అతి తక్కువ టైములో తమ అనుభవాల్ని ఎంత ఉత్కంఠగా మల్చగలరనేదే పరీక్ష.

చరిత్ర క్రమంలోకిపోతే, చిన్నకథ 1690 నుండి "దేవతల కథలు" **(Fairy Tales)** తో ప్రారంభమయినట్టు తెలుస్తుంది. దీన్ని బారోనెస్ డి 'అల్నాయ్, మరీక్యాథరిన్,తజుమెల్ డి బార్నవెలీ వంటివారు అందిపుచ్చుకున్నారు. అయితే 1697లో చార్లెస్ ఫెరాల్ట్ అనే వ్యక్తి చిన్న కథను కొత్త మలుపుతిప్పాడు. అతడా కథను పిల్లలకు నచ్చేటట్లు రాయడం మొదలుపెట్టాడు. కథలు పిల్లలకు నచ్చడంలో, ఇక చెప్పేదేముంది. కథ విరివిగా ప్రజల్లోకి పోయింది. దీనితో బాటు, అప్పటి స్త్రీలు అతిథ్యశాల **(Ladies Salon)** లల్లో కూడా కథల్ని వినిపించడం మొదలెట్టే సరికి, ప్రజల్లో చిన్న కథల పట్ల క్రేజ్ పెరిగింది.

ఓ రకంగా చెప్పాలంటే... కులీనవర్గాలలో ఉన్న సంకెళ్లను తెంచుకొని, కల్పనా సాహిత్యంలో సేదదీరేందుకు "చిన్న కథ" బాగా తోడ్పడ్డది. అప్పటికే అంతర్యుద్ధాలు, తిరుగుబాట్లు, మార్కెట్ విస్తరణలు జరుగుతుండడంతో రచయితలకు,

ప్రజలకు నౌకాశ్రయాలల్లో, ఇంకా అనేకానేక కూడళ్లలో కావల్సినన్ని కథలు దొరికేవి. కొత్త కొత్త ప్రాంతాలు, జాతులు, మతాలు, సాంప్రదాయాల గురించి తెల్సుకునే వీలు దొరికింది.

1706లో (ఫెరాల్ట్ మరణించిన మూడు సం॥ల తర్వాత) యాంటోని గెల్లండ్ అనే రచయిత, "కితాబ్ ఆల్ఫ్ లాయిలా వా-లాయిలా" అనే పుస్తకాన్ని అరబిక్ భాషనుండి ఫ్రెంచిభాషలోకి అనువాదం జేశాక, చిన్న కథ కొత్త లోకం జూసింది. తర్వాత ఎడ్వర్డ్‌లేన్ "అరేబియన్ నైట్స్ వినోదాలు" పేరుతో 1840లో ఇంగ్లీషులోకి అనువాదించాక చిన్నకథకు రెక్కలొచ్చాయి. ఇక అది ప్రపంచాన్ని చుట్టెయ్యడం మొదలయ్యింది. అయితే ఈ కథల మీద సంస్కృతంతో బాటు తమిళం తదితర ఆసియా భాషల ప్రభావముంది.

సాహసం, కల్పన, సుదూర ప్రాంతాల ప్రజల జీవితానుభవం, తమతమ జీవితానుభవాలతో కలగలిపి కథలుగా మలిచే వాళ్ళు. ప్రతి చిన్నకథ, పెద్ద కథలో చక్కగా ఇమిడిపోయేది. వాటిని విడిగా చదువుకున్న పాఠకులకు ఆసక్తి గొలిపేది. షెహర్ ఎడాదే (నగర స్వేచ్ఛ) అనే కథా గుచ్ఛానికి ఓ ఆసక్తి గొలిపే కథ ఉంది. ఇది రాణి (షెహర్ జాదే) గారు తన భర్తకు చెప్పిన చిన్న కథల సమాహారం... ఆమె భర్త షెహరియార్ (రాజు) ఛండశాసనుడు. తప్పుజేసే స్త్రీల పట్ల కఠోరశిక్షలు అమలుపర్చేవాడు. దానిలో కొన్ని సంవత్సరాల వరకు, పట్టణంలో స్త్రీలు నిరంతరం భయంతో వొణికిపోయేవారు. (రాజుగారు గదా ఆయనకేది, ఎప్పుడు తప్పుగా అనిపిస్తుందో ఎవరు చెప్పగలరు.) ఈ విపత్తు నుండి స్త్రీలను రక్షించడానికి షెహర్‌జాదే ఓ కొత్త టెక్నిక్ కనిపెట్టింది. ఆమె అనేక సంఘటనలను చిన్న చిన్న కథలుగా మల్చి, రాత్రిపూట భర్తను కూచోబెట్టుకొని, ఒక్కొక్కటే చెప్పుకొచ్చేది. - రాజు, ఆమె కథల పట్ల సమ్మోహితుడవడమేగాక, వాటిలోని సారాన్ని, జ్ఞానాన్ని గ్రహించి, స్త్రీల పట్ల వివక్షకు, తీక్షణతను తగ్గించుకున్నారు. తద్వారా నగర స్వేచ్ఛ (షెహర్ ఎజాదే) దొరికినట్టయింది.

**ఆమె అనేక సంఘటనలను చిన్న చిన్న కథలుగా మల్చి, రాత్రిపూట భర్తను కూచోబెట్టుకొని, ఒక్కొక్కటే చెప్పుకొచ్చేది. - రాజు, ఆమె కథల పట్ల సమ్మోహితుడవడమే గాక, వాటిలోని సారాన్ని, జ్ఞానాన్ని గ్రహించి, స్త్రీల పట్ల వివక్షకు, తీక్షణతను తగ్గించుకున్నారు.**

ఆసక్తిగా లిప్ కథనంలో, తెలివైన ఎత్తుగడల్తో, బిగింపైన ముగింపుల్తో చిన్న కథలు ప్రజల హృదయాల్ని చూరగొనేవి. షెహర్‌జాదే తన కథల్ని రాత్రిపూట మొదలుపెట్టడం, తెల్లారేదాక సాగడం, అవి కేవలం రాజుకోసమే ఉద్దేశింపబడి ఉండడంలో, ఆ పరిస్థితులకు అనుగుణంగా ఆమె తన కథల్ని మల్చుకునేది.

షెహర్‌జాదే తర్వాత, చార్లస్ డికెన్స్ తన కథల్ని ఆసక్తికరంగా మల్చడానికి ప్రత్యేక శ్రద్ధ తీసుకునేవాడు. అప్పటికే ఆయన రాసిన నవలలు, **"Hard times" "Oliver Twist"** మొదలైనవి పత్రికల్లో సీరియళ్లుగా వచ్చేవి. అవి మాస పత్రికలుగా, అర్థమాస పత్రికలుగా వచ్చేవి. అయితే ఆయన ప్రతి సంచికలో వచ్చే కథా భాగాన్ని ఆసక్తికరంగా మల్చడంలో పాఠకులు ఆయా సంచికల కోసం ఎదురుచూసేవాళ్లు. నవలలోని పాత్రలు, నవలలో మొత్తంగా కనబడినప్పటికీ, ఒక్కో సంచికలోని కథాభాగం, ఒక ప్రత్యేక కథగా కనబడి, పాఠకుని తన వెంట తిప్పుకునేది.

చార్లెస్ డికెన్స్ లండన్ వీధుల్లో తిరుగుతూ, ప్రజల సంభాషణలవైపు ఓ కన్నేసేవాడు. ఎక్కడైనా 'మెరుపు' కనబడితే వెంటనే నోట్ జేసేవాడు. అందుకే ఆయన చెప్పేమాట, "కథను చూపించు - చెప్పకు" అనేది ప్రసిద్ధమైన నానుడిగా మారింది.

చలంగారన్నట్లు క్లుప్తత **(Brevity)** అనేది చిన్న కథను శాసించే మంచిగుణం - అది చార్లెస్ డికెన్స్ ఆనాడే పుణికి పుచ్చుకున్నాడు. ఆయన తన పుస్తకంలోని ప్రతి పేజీని ఆసక్తికరంగా మారుస్తూ, మరో కొత్త నవలకు పునాది వేసుకునేవాడు. ఆయన పత్రిక సంచికలో కథాభాగాన్ని ఆసక్తికరమైన చిన్న కథలాగ మల్చడంలో పాఠకులు విపరీతంగా పెరిగిపోయారు.

ఓ చిన్న కాల పరిమితిలో జరిగే ఘటనల ద్వారా, కథలోని పాత్ర ఏం చెప్పదల్చుకున్నదో మనకు తెల్సి పోతుంది. అది చిన్న కథకు ఆయువుపట్టు కూడా. చిన్న కథ చెప్పడంలో నిష్ణాతులైనవారు, దీన్ని సాధించగల్గుతారు. హిల్లరీమాంటెన్ తన కథ "దిలాంగ్ క్యూటీ **(The Long QT)** అనే కథలో ఏం చెబుతున్నారో చూడండి.

"అతడు ఆమెకు చేరడాన్కి మంచుముద్దల్ని చీల్చినట్లు కిటికీ అద్దాల్ని పగలగొట్టుకొని వొచ్చాడు. ఇన్నాళ్లుగా ఆమె కురూపినని భయపెట్టినందుకు, ఆ రోజు ఆమె చెంపవాయగొడ్దా మనుకున్నాడు. వొచ్చీరావడంతోనే, అతడామె చేయిపట్టిలాగాడు. కాని.... ఆమెది మొండిచేయి... వెంటనే అతడు "క్రిష్ట ఆల్ మైటీజోడీ" అంటూ గట్టిగా అరిచాడు. ఆమె ఏ మాత్రం చలించలేదు. ఆమె చెవిటిదని తెల్సిపోయింది. ఆపుకోలేని బాధలో, అతడామె తలను పట్టుకొని, విపరీతంగా ఊపుతూ, ఆమె కళ్లలోకి చూశాడు. అవి గాజుకళ్లు.

# రుద్రాక్ష పిల్లి



- గుర్రాల రమణయ్య
99639 21943

పిడికిట్లో సూర్యుడ్ని ఒడిసి పట్టుకొని
జనంలో తిరుగుతుంటాడు అతడు
గుండెల్లో విస్ఫోటించిన క్రాంతి పర్వతం
లావానదై నరాల్లో ప్రవహిస్తుంటుంది
మనసంతా ఆక్రమించిన బూర్జువాల ముఖచిత్రాన్ని
సూర్య కిరణాల్లాంటి చూపులు అన్వేషిస్తుంటాయి
గిరిజనుల గుడిసెల్ని తగులబెట్టిన దగాకోర్ల
కొరకంచుల ఆచూకికోసం వెతుకుతుంటాయి
సగందేహాన్ని సగం ఆచ్ఛాదనల్ని కప్పుకొన్న మహిళల్ని
మానాలతో ఆడుకొన్న పోలీసు పశువులకోసం
అడవి అణువణువునీ దుర్భిణీకళ్ళు గాలిస్తుంటాయి
పొదల్లో దాక్కొని కొంకనక్కలా దాడి చేసిన
స్వార్థ పారిశ్రామికవేత్తల చిరునామాలు సేకరిస్తుంటాయి
రవ్వలమారి రాజకీయ రాబందుల వాగ్ధానాలతో
మోసపోయిన అమాయకుల్ని పరిశీలిస్తుంది మెదడు
అడవిని ఆగమాగం చేసిన దళారుల్ని శోధిస్తూ
అడవి పువ్వుల్ని నలిపేసిన కామాందుల్ని అన్వేషిస్తూ
కొండలు కోనల్లో ప్రతిధ్వనించే ప్రతిశబ్దాన్ని అవలోకిస్తూ
జనచైతన్య యాత్ర చేస్తుంటాడు అతడు
సూర్యుడు కిరణాయుధాలతో ఉదయించే జనారణ్యంలో
రెండుకాళ్ళ మృగాళ్ళకోసం గాలించే ప్రయాసలో
అడవికి ద్రోహం చేసిన రుద్రాక్ష పిల్లుల్ని వేటాడడానికి
తన పులిపంజాని సానబడుతుంటాడు అతడు

---

అతడికి విపరీతంగా దుఃఖం ముంచుకొచ్చింది. ఆమెను తీసుకుపోతున్న అంబులెన్స్ వర్కర్ భుజం మీద తలపెట్టి భోరుమని ఏడవాలనిపించింది. కాని – అతని మానసిక స్థితిని ఎవరూ పట్టించుకునేవారు లేరు".

చిన్న కథ మనల్ని షాక్ చేయడానికి పుట్టింది. చదివే పాఠకులు కాగితం మీద ఉన్న దాని కన్నా భిన్నంగా స్పందిస్తారు. చికా ఉనిగ్వే అనే రచయిత్రికి కామన్‌వెల్త్, **BBC** చిన్న 6 కథల పోటీల్లో అవార్డులొచ్చాయి. ఆమె ఆఫ్రికన్ కథా సాహిత్యంలో కెయిన్ ప్రైడ్‌కు కూడా ఎంపికైంది. చిన్న కథలు రాయడంలో ఆమె పద్ధతి వేరుగా ఉంటది. ఆమె కథ రాయడానికీ, చదవటానికీ ముందుగా ప్రాధాన్యత ఇచ్చే అంశం భూమిక. కథలు ఏ వాతావరణం నుంచి లేస్తున్నాయి. (చలం) అనడానికి, ఆమె ఎక్కువ ఆసక్తి చూపుతుంది. భౌతిక వాతావరణాన్ని సూచించడం ద్వారా కథలోని పాత్రకు దానిలోగల ఉద్వేగ సంబంధాల **(Emotional bond)** ను సూచిస్తుందని ఆమె అభిప్రాయం. ఈ ఉద్వేగ సంబంధాల్ని సంభాషణల ద్వారా కూడా చూయించవచ్చు. అయితే భౌతిక వాతావరణాన్ని సృష్టించడం ద్వారా కథలోని పాత్ర పాఠకుడిని ఎక్కడికి తీసుకుపోతున్నది అర్థమవుతుంది. ఒకసారి ఆ వాతావరణంలోకి ప్రవేశించినాక, వెనక్కి తిరగడమనేదే ఉండదు. కథలోని ఆయువుపట్టు అదే.

చిన్న కథ నిడివి ఎంత ఉండాలి? అనే ప్రశ్న వేస్తుంటారు. చిన్నకథలు 10,000 పదాల నుండి 30,000 పదాల వరకు నిడివి కల్గి ఉన్నాయి. అయితే కేవలం 71 పదాలు మాత్రమే కలిగిన లిడియా డేవిస్ కథను ఎట్లా ఊహించుకుంటారు.

ఇది చదవండి

"భద్రప్రేమ....

ఆమె తన కొడుకుకు చికిత్స చేసే పిల్లల డాక్టరు **Pediatrician** తో ప్రేమలో పడ్డది. నగర పొలిమేరల్లో ఒంటరిగా జీవిస్తున్న ఆమెను ఎవరయినా నిందించవచ్చు.

ఆమె ప్రేమలో ఓ గొప్ప మోహం ఉంది. అందులో భద్రత కూడా ఉంది. అయితే.. అవతల ఆమె ప్రేమిస్తోన్న మనిషి ఉన్నాడు. అతనికీ, ఆమెకు మధ్య.. పరీక్షకు సిద్ధమవుతున్న కొడుకు, ఆఫీసు, ఆఫీసు సిబ్బంది, అతని భార్య, ఆమె భర్త, అతని స్టెతస్కోపు, అతని గడ్డం, ఆమె వక్షోజాలు, అతని కళ్లద్దాలు, ఆమె కళ్లద్దాలు మొదలైనవి ఉన్నాయి.

రహస్య సంభాషణలు నడుస్తున్న ఈ కాలంలో చిన్న కథ పుంజుకోవటం సరైనదే. సమగ్రమైనదే. నిజానికి పుస్తకాలే వాస్తవం కన్నా ఎక్కువ మాట్లాడగలవు.

**(The Hindu 05-04-2015 నాటి వ్యాస అనుసరణ)**

# తెలుగు నవలా సాహిత్యంలో దళిత జీవన చిత్రణ



*తెలుగు నవలా సాహిత్యంలో పూర్తి నవలా లక్షణాలతో కందుకూరి వీరేశలింగం రాజశేఖర చరిత్రము(1878) వచ్చినట్లే, తెలుగు దళిత నవలా సాహిత్యంలో దళితాభ్యున్నతి పరంగా మంచి చైతన్యం చిత్రించబడ్డ నవల ఉన్నవ లక్ష్మీనారాయణ రాసిన "మాలపల్లి" (1922). ఇది గాంధీజీ జాతీయోద్యమ ప్రభావంతో, దళితుల్ని స్వాతంత్ర్యోద్యమంలో భాగస్వాములు చేయడం కోసం వ్రాయబడింది.*

**డాక్టర్ తన్నీరు కళ్యాణ్ కుమార్**

**9490776385**

స్వాతంత్ర్యానంతర తెలుగు నవల్లో దళితాభ్యుదయం ప్రతిభావంతంగా రూపుకట్టడానికి సుదీర్ఘమైన నేపథ్యం వుంది. తెలుగులో తొలి నవలలుగా చెప్పబడే నరహరి గోపాలకృష్ణమ్మశెట్టి వ్రాసిన "శ్రీరంగరాజ చరిత్ర", కందుకూరి వీరేశలింగం వ్రాసిన "రాజశేఖర చరిత్ర" (1878) నవలల్లో దళిత సమస్యల చిత్రణ రేఖా మాత్రంగా వుంది. దీన్ని బట్టి నవల ప్రక్రియ పుట్టుకతోనే దళితాంశాన్ని స్వీకరించినట్లు తేటతెల్లమౌతుంది. జాతీయోద్యమంలో భాగంగా వచ్చిన సంఘ సంస్కరణోద్యమం సంఘంలోని అనేక చీకటి కోణాల మీద వెలుగును ప్రసరింపచేసింది. అందులో భాగంగానే హరిజనోద్ధరణ, స్త్రీ జనోద్ధరణ, విద్య పట్ల నూతన దృక్పథం, మూఢాచార నిరసన వంటివి ఆ కాలపు రచనలకు ప్రధాన వస్తువులయ్యాయి.

దళితా నవలా సాహిత్యంలో వెలుగుచూసిన తొలి నవలగా తల్లాప్రగడ సూర్య నారాయణ రాసిన "హేలావతి" (1913)ను చెప్పుకోవచ్చు. తెలుగులో మొదటి నవల శ్రీ రంగరాజు చరిత్రలో ఎలాగైతే పూర్తి నవలా లక్షణాలు కనిపించలేదో, దళిత నవలా సాహిత్యంలో కూడా మొదటిదిగా పేర్కొనబడుతున్న తల్లాప్రగడ వారి హేలావతి నవలలో కూడా దళిత జీవన చిత్రణ ఉంది గానీ దళిత చైతన్యం కనిపించలేదు. సాంఘిక వ్యవస్థ, వర్ణ వ్యవస్థలను గురించిన నిశితమైన విమర్శ ఈ నవల్లో కనిపిస్తుంది. హరిజనోద్ధరణ ప్రధానంగా కనిపించడమే కాకుండా, సంఘులోని అన్యాయాల్ని పోగొట్టడానికి కావాల్సిన మార్గన్వేషణాంశాలు ఈ నవలలో చక్కగా చిత్రించారు. వేంకట పార్వతీశ్వర కవులు రాసిన "మాతృమందిరం" (1919) నవలలో దుష్టులకు శిష్టగుణాలు అలవర్చడం, అనాధలలో ఆత్మ విశ్వాసాన్ని కల్పించడం, వారిని భావి భారత పౌరులుగా దేశాభ్యుదయానికి సేవ చేసేవారుగా చేయడం ఈ నవల ప్రధానోద్దేశంగా కనిపిస్తుంది.

తెలుగు నవలా సాహిత్యంలో పూర్తి నవలా లక్షణాలతో కందుకూరి వీరేశలింగం రాజశేఖర చరిత్రము(1878) వచ్చినట్లే, తెలుగు దళిత నవలా సాహిత్యంలో దళితాభ్యున్నతి పరంగా మంచి చైతన్యం చిత్రించబడ్డ నవల ఉన్నవ లక్ష్మీనారాయణ రాసిన "మాలపల్లి" (1922). ఇది గాంధీజీ జాతీయోద్యమ ప్రభావంతో, దళితుల్ని స్వాతంత్ర్యోద్యమంలో భాగస్వాములు చేయడం కోసం వ్రాయబడింది. ఆనాటి సంఘంలో అస్పృశ్యతా జాడ్యం ఎంత తీవ్రతరంగా వుందో, దళితులు ఎటువంటి వివక్షతలకు - అన్యాయాలకు

లోనవుతున్నారో అనే విషయాన్ని ఈ నవల తెలియజేస్తుంది. మాలపల్లి నవలలో పరోక్ష రీతిలో వర్ణితమైన జాతీయోద్యమం వేలూరి శివరామశాస్త్రి "ఓబయ్య" (1920) నవలలో ప్రత్యక్షంగా కన్పిస్తుంది. గాంధీ మహాత్ముని అపూర్వ వ్యక్తిత్వానికి ప్రభావితులైన లక్షలాది మంది ఆనాటి పల్లె యువకులకు ఓబయ్య ప్రతినిధి. గ్రామీణ పునర్నిర్మాణం ద్వారానే జాతి బాగుపడుతుందనే గాంధీ సిద్ధాంతానికి వాస్తవ రూపాన్ని ఇచ్చేందుకు నవలలో ఓబయ్య కృషి చేస్తాడు.

సాంఘిక సమానత్వం, రాజకీయ హక్కులు హరిజనులకు కల్పించాలనే నేపథ్యంతో ఆచార్య ఎన్.జి.రంగా రాసిన నవల "హరిజన నాయకుడు" (1933), హరిజనులపై క్రైస్తవ మత ప్రభావాన్ని గూర్చి ఈ నవలలో రచయిత చక్కగా చిత్రించారు. ఈ నవలకు రావాల్సినంత పేరు, విస్తృత ప్రచారం దక్కలేదన్నది వాస్తవం. గాంధేయ వాదంతో గ్రామాలలో సంఘసంస్కరణకు పూనుకున్న వ్యక్తులకు ఎదురైన ప్రతిఘటనలను మహీధర రామమోహనరావు రాసిన "కొల్లాయి గట్టితేనేమి" నవల స్పష్టం చేస్తుంది. ఈ నవల్లో ఆనాటి సాంఘిక, రాజకీయ పరిస్థితులు చక్కగా చిత్రించబడ్డాయి. ఇల్లింద్ర రంగనాయకులు రాసిన నవల "మల్లిక" . ఈ నవల నాయకుడైన లక్ష్మీనాథశాస్త్రి తమ స్వగ్రామంలో హరిజనోద్ధరణకు పాటుపడటం, ఈ క్రమంలో గ్రామంలోని సంప్రదాయ వాదులు అతనితో విభేధించడం, చివరకు అస్పృశ్యతను పాటించడం అమానుషమని గ్రామస్తులు తెలుసుకోవడంతో నవల పూర్తవుతుంది. డా. అంతటి నరసింహం రాసిన "ఆదర్శం" అనే నవలలో దళిత ప్రగతి కాంక్ష కన్పిస్తుంది. ఉపాధ్యాయులు, ఊరు పెద్దలు దళితులకు చదువు చెప్పడం, వారికి చదువు పట్ల ఆసక్తిని కలుగజేయడం ప్రధానాంశంగా ఆ నవల కొనసాగుతుంది.

స్వాతంత్ర్యానంతర గ్రామీణ దళితుల జీవితాలను అక్కినేని కుటుంబరావు రాసిన "సొరాజ్జెం" అనే నవలలో చిత్రించారు. బడుగు, బలహీన శ్రామిక వర్గాలంతా కలిసి కూలీ రేట్లు పెంచాలని ఉద్యమించడం, భూస్వాములు ఆ ఉద్యమాన్ని వంచనతో అణిచివేయడం, గత్యంతరం లేక కూలీలంతా పొట్ట పోషణ కోసం ఇతర ప్రాంతాలకు వలసపోవడం ఈ నవలలో కన్పిస్తుంది. దళితుల పేదరికాన్ని ఆసరాగా తీసుకొని భూస్వాములు వారిని అవమానించడం, దళిత స్త్రీలపై అఘాయిత్యాలకు పాల్పడటం, ఈ దుర్మార్గాలను దళితులంతా సంఘటితంగా ఎదుర్కొని భూస్వామిని హతమార్చడం అనే ఇతివృత్తంతో నరసింహప్రసాద్ "అసురగణం" అనే నవలను వ్రాశారు. దళితులు ఆత్మాభిమానం కోసం వాళ్ళకు జరిగే అన్యాయాల్ని వ్యతిరేకించడం కోసం ఉద్యమించాల్సిన అవసరాన్ని డా. ఆంజనేయులు రాసిన "రాకాసి కోడలు" అనే నవల ప్రబోధిస్తుంది. సంఘటిత శక్తితో దళితులు వారిని హింసిస్తున్న భూస్వామిని భూస్థాపితం చేయడానికి సమాయత్తం కావడంతో నవల ముగుస్తుంది.

వట్టికోట ఆళ్వారుస్వామి తన "ప్రజల మనిషి" నవలలో నాటి దళితులు నిజాం పాలనాధికారులు, పట్వారీల మధ్య నలిగిపోయిన వైనాన్ని చక్కగా వివరించారు. నాటి దళితుల పేదరికాన్ని ఆసరాగా తీసుకొని నిజాం ప్రభుత్వ అనుబంధ సంస్థ అయిన అంజుమన్ వారని క్రైస్తవులుగా మార్చే ప్రయత్నం చేయడం, క్రైస్తవులుగా మారిన దళితులను గ్రామ పట్వారీలు సాంఘిక బహిష్కరణ విధించడం, పట్వారీలు ఆర్య సమాజ ప్రచారకులను పిలిపించి క్రైస్తవులుగా మారిన దళితులకు తిరిగి శుద్ధి సంస్కారం జరిపి హిందువులుగా మార్చడం తదితర అంశాలు ఈ నవలలో చిత్రించబడ్డాయి. విశ్వనాథ సత్యనారాయణ "బద్దన్న సేనాని" నవలలో నాయకుడైన బద్దన్న మాదిగ కులస్థుడు. గోశాల నివాసియైన ఇతడు వీరశైవుడు. ఇతడు కేవలం జ్ఞాని మాత్రవే కాకుండా వీరశైవ నియమాలకు కట్టుబడి వుండాలనే నియమ నిబంధనల్ని కలిగిన గొప్ప భక్తుడు. ఎన్.ఆర్. నంది తాను రాసిన "నైమిశారణ్యం" నవలలో హరిజనులను అగ్రకులాల వారు ఈ నాటికి ఎలా హింసిస్తున్నారో చక్కగా చిత్రించారు.

రంగనాయకమ్మ వర్ణాంతర వివాహాల్ని ప్రోత్సహించాలనే సంకల్పంతో "బలిపీఠం" నవలను వ్రాశారు. దళిత నవలా సాహిత్యంలో తొలి నవలా రచయిత్రిగా ఈ రచనతో ఆమె స్థానం సంపాదించుకున్నారు. వర్ణాంతర వివాహాల్లో వుండే కష్ట సుఖాల్ని, సర్దుకుపోవాల్సిన అవసరాన్ని, కులరహిత సమాజ భావనల్ని ఈ నవల ప్రబోధిస్తుంది. సమాజంలోని అస్పృశ్యత జాడ్యాన్ని రూపుమాపాలనే ధ్యేయంతో నముకలకంటి జగన్నాథం "అంటరాని జంట" అనే నవల్ని రాశారు. వర్ణాంతర వివాహాల ద్వారానే సమ సమాజం సిద్ధిస్తుందని ఈ నవల సందేశాన్నిస్తుంది. ప్రముఖ నవలా రచయిత్రి లత రాసిన

**స్వాతంత్ర్యానంతర గ్రామీణ దళితుల జీవితాలను అక్కినేని కుటుంబరావు రాసిన "సొరాజ్జెం" అనే నవలలో చిత్రించారు. బడుగు, బలహీన శ్రామిక వర్గాలంతా కలిసి కూలీ రేట్లు పెంచాలని ఉద్యమించడం, భూస్వాములు ఆ ఉద్యమాన్ని వంచనతో అణిచివేయడం, గత్యంతరం లేక కూలీలంతా పొట్ట పోషణ కోసం ఇతర ప్రాంతాలకు వలసపోవడం ఈ నవలలో కన్పిస్తుంది.**

"మిసెస్ కోకిల" నవల దళితాభ్యుదయాన్ని, వర్ణాంతర వివాహాల్ని కాంక్షిస్తుంది. ఉన్నత కుటుంబంలో పుట్టిన కోకిల అభ్యుదయ భావాలకు ఆకర్షితురాలై దళితుడైన జీవరత్నంను రిజిస్ట్రర్ వివాహం చేసుకుంటుంది. కాని ఆ తర్వాత వారిద్దరి మధ్య కొన్ని బేధాభిప్రాయాలు చోటు చేసుకుంటాయి. కోకిల అతని నుండి విడాకులు కోరుతుంది. అవగాహన లేకుండా తొందరపడి ఆదర్శ వివాహం చేసుకోవడం మంచిదికాదని ఈ నవల సందేశాన్నిస్తుంది. భూపతి రామారావు రాసిన "కులకన్య" అనే నవల వర్ణాంతర వివాహాలను ప్రోత్సహిస్తుంది. దళితులు తమ సంపాదనలో కొంత భాగాన్ని దళిత ప్రగతి కోసం జరిగే ఉద్యమాలకు దానం చేయాల్సిన అవసరాన్ని ఈ నవల తెలియజేస్తుంది.

డా. కేశవరెడ్డి రాసిన "ఇన్ క్రేడిబుల్ గాడెస్', "స్మశానం దున్నేరు', ''చివరి గుడిసె', ''మునెమ్మ', ''రాముడుండాడు రాజ్జెముండాది'' మొదలైన నవలలో దళితాభ్యుదయం కనిపిస్తుంది. కూలీలు పడే శ్రమను, వారిని భూస్వాములు దోచుకునే తీరును, దళితులు నిరంతరం అనుభవించే దుర్భర దారిద్ర్యాన్ని ''ఇన్ క్రేడిబుల్ గాడెస్" నవల తెలియజేస్తుంది. అట్లే భూస్వాములు దళితుల పొలాల్ని, బంజరు భూముల్ని ఆక్రమించుకోవడమే గాక హరిజనులకు చెందిన స్మశానాన్ని కూడా ఆక్రమించుకొని సాగుచేయడం "స్మశానం దున్నేరు" నవలలోని ఇతివృత్తం. అస్పృశ్యుల్ని అవమానాలకు గురిచేస్తూ ఊరికి దూరంగా వుంచి, వారిని అనేక విధాలుగా దోచుకోవడాన్ని "చివరి గుడిసె" నవల విశదీకరిస్తుంది. కప్పగంతుల మల్లికార్జునరావు "తకథిం తకథిం తోలుబొమ్మ" నవలలో కథా నాయకుడైన గాంధీ హరిజనుడు. లా చదివి న్యాయవాదిగా పేరుగాంచిన గాంధీ భూస్వామి కూతురైన సరోజినిని వివాహం చేసుకుంటాడు. గాంధీ దళితాభ్యుదయానికి పాటుపడుతున్నట్లు నటిస్తూ, అక్రమార్జనకు పాల్పడుతుంటాడు. భవాని అనే పదో తరగతి అమ్మాయిని మభ్యపెట్టి లోబరుచుకోవడమే కాకుండా ఆ అమ్మాయిని ఒక ఆటబొమ్మగా ఉపయోగించుకుంటాడు. ఈ సంగతి తెలిసి అతని భార్య చనిపోతుంది. దళితులే దళితాభ్యుదయాన్ని కోరుకోని సందర్భాలు అనేకం వున్నాయని, ఈ పరిస్థితి మారాలని ఈ నవల తెలియజేస్తుంది.

***1980 సంవత్సరానికి ముందు తెలుగులో వెలువడిన నవలలో అత్యధిక భాగం నవలలు దళితేతర రచయితలు వ్రాసినవే. నాటి కాలంలో దళితుల జీవనస్థితి, వారు పడుతున్న అవమానాలు, వారి జీవన స్థితిగతుల పట్ల సానుభూతి, గాంధేయవాద దృక్పథంలో దళితుల పట్ల ప్రేమ భావాన్ని పెంపొందించుకోవడం, సంఘసంస్కరణ దృక్పథంతో వారి జీవితాల్లో మార్పు తీసుకొని రావడానికి ప్రయత్నించడం, వర్ణాంతర వివాహలు, దళిత విద్యాభ్యాస ఆవశ్యకత, అంబేద్కరిజం తదితర అంశాల చిత్రణ ఆ నవలల్లో చోటుచేసుకుంది.***

దళితాభ్యుదయానికి అవరోధంగా ఉన్న అనేక అంశాలను ఎత్తి చూపుతూ వాటిని అధిగమించి, దళిత ప్రగతి సాధించాలని జె. రామలక్ష్మి రాసిన ''తపోభంగం'' అనే నవల సందేశాన్నిస్తుంది. ఆమె రాసిన మరో నవల "కోటిగాడు" దళితులు చైతన్యవంతులై ప్రగతి చెందడానికి మిగిలిన వారు సహకారాన్ని అందించడం సాంఘిక బాధ్యతగా గుర్తించాలని ఉద్బోధిస్తుంది. కులరహిత సమాజ స్థాపనే ధ్యేయంగా డా. ముదిగొండ శివప్రసాదరావు "నవ కళ్యాణం" అనే నవలను వ్రాశారు. బసవేశ్వరుని ఆశయాలకు ఆ నవల ప్రతిబింబం. దళితుల్లో కూడా మంచి భక్తులు, సత్ శీలురు వుంటారనే విషయాన్ని ఆ నవల తెలియజేస్తుంది. పాలక వర్గాల చేతిలో దళితులు ఏవిధంగా వంచించబడుతున్నారో దడాల చంటబ్బాయి ''అంతులేని అమావాస్య" నవల వివరిస్తుంది. దేశమంతా ముందుకు పోతుంటే హరిజనులు మాత్రం అంతులేని అమావాస్యలో కొట్టుమిట్టాడుతూనే వున్నారనే భావం ప్రతిబింబించేలా నవలాకారుడు నవలకు ఈ పేరు పెట్టడం జరిగిందని చెప్పవచ్చు. అట్లే "నరుడు', "విరిగిన కెరటాలు', ''చీకటి చెదిరింది', ''త్రివర్ణ పతాక', "చివరి మజిలీ', "మోహనరాగం" తదితర నవలలు గ్రామలలో దళితులు ఎదుర్కొంటున్న అవమానాలను గూర్చి, వారు ఎదుర్కొంటున్న సమస్యలను గూర్చి, అప్పుడప్పుడే వారిలో కలుగుతున్న చైతన్యాన్ని గూర్చి చిత్రించాయి.

1980 సంవత్సరానికి ముందు తెలుగులో వెలువడిన నవలలో అత్యధిక భాగం నవలలు దళితేతర రచయితలు వ్రాసినవే. నాటి కాలంలో దళితుల జీవనస్థితి, వారు పడుతున్న అవమానాలు, వారి జీవన స్థితిగతుల పట్ల సానుభూతి, గాంధేయవాద దృక్పథంలో దళితుల పట్ల ప్రేమ భావాన్ని పెంపొందించుకోవడం, సంఘసంస్కరణ దృక్పథంతో వారి జీవితాల్లో మార్పు తీసుకొని రావడానికి ప్రయత్నించడం, వర్ణాంతర వివాహలు, దళిత విద్యాభ్యాన ఆవశ్యకత, అంబేద్కరిజం తదితర అంశాల చిత్రణ ఆ నవలల్లో చోటుచేసుకుంది. దళిత చైతన్యం, పోరాట దృక్పథం,

అత్మాభిమానం వంటి అంశాలు ఈ నవలల్లో రేఖా మాత్రంగానే కన్పిస్తాయి.

1990వ దశకంలో జాతీయ అంతర్జాతీయ సంస్థలు దళిత హక్కుల కోసం పోరాటం చేయడం ప్రారంభించాయి. సాంఘిక వివక్షకు, అసమానలతకు వ్యతిరేకంగా ప్రపంచవ్యాప్తంగా ఉద్యమాలు ఆరంభమయ్యాయి. దళితులకు రాజ్యాధికారం అనే నినాదంతో 1984లో కాన్షీరాం దళితుల రాజకీయ హక్కులు సాధించడానికి బహుజన పార్టీ స్థాపించడం, 1985లో మన రాష్ట్రంలో కారంచేడులో దళితుల ఊచకోత, 1986లో దళిత మహాసభ ఆవిర్భావం, చుండూరు, నీరుకొండల్లో దళితులపై పునరావృతమైన దాడులు జరిగాయి. ఈ దాడుల నేపథ్యంలో అనేక దళిత చైతన్య ఉద్యమాలు " పోరాట ఉద్యమాలు పురుడుపోసుకున్నాయి. కేంద్రంలో మండల కమీషన్ నివేదిక అమలు ప్రకటన, రిజర్వేషన్ అనుకూల" ప్రతికూల పవనాలు, ఫలితంగా నూతన సమీకరణాలు రూపొందాయి.

కోస్తాలో మిషనరీల సహాయంతో ఆరంభమైన దళిత వికాసం, మార్క్సిస్ట్ ఉద్యమాలు దళితులకు ఆత్మ స్థైర్యాన్నిచ్చాయి. విద్యా, ఉద్యోగ రంగాల్లో ప్రవేశించిన నేటి దళితయువత, ఆత్మన్యూనతా భావం విడనాడి కులం పేర్లను తమ పేర్లతో సహా ప్రకటించుకునే ఆత్మ గౌరవాన్ని పెంపొందించుకుంది. ఈ కారణాలన్నీ గత పది పదిహేనేళ్ళలో వచ్చిన సాహిత్యం మీద తీవ్ర ప్రభావాన్ని చూపాయి.

1987లో మహారాష్ట్ర రాజధానిలో అఖిలభారత దళిత రచయితల మొదటి సభలు జరిగాయి. ఇవి సాహిత్యంలో దళితుల ఉనికిని తెలియచేశాయి. 1993లో హైదరాబాద్‌లోను, 95లో వరంగల్లోనూ "ఆంధ్రప్రదేశ్ దళిత రచయితల కళాకారుల మేధావుల ఐక్యవేదిక సభలు జరిగాయి. సమస్త వర్ణ లింగ, కుల, జాతి, మత, భాష, ప్రాంతీయ అసమానతలకు వ్యతిరేకంగా పోరాడుతూ అణచివేతకు - దోపిడీకి - అసమానతలకు తావులేని నిజమైన ప్రజాస్వామ్యకతను తన సాంస్కృతిక విలువలతో కూడిన నిర్మాణానికి కృషి చెయ్యాలని తీర్మానించడం జరిగింది. ఈ నేపథ్యంలోనే తెలుగులో దళిత సాహిత్యం ప్రాణం పోసుకుంది. అంతకు మునుపే కోస్తాలో మిషనరీల సహాయంతో ఆరంభమైన దళిత వికాసం, మార్క్సిస్ట్ ఉద్యమాలు దళితులకు ఆత్మ స్థైర్యాన్నిచ్చాయి. విద్యా, ఉద్యోగ రంగాల్లో ప్రవేశించిన నేటి దళితయువత, ఆత్మన్యూనతాభావం విడనాడి కులం పేర్లను తమ పేర్లతో సహా ప్రకటించుకునే ఆత్మ గౌరవాన్ని పెంపొందించుకుంది. ఈ కారణాలన్నీ గత పది పదిహేనేళ్ళలో వచ్చిన సాహిత్యం మీద తీవ్ర ప్రభావాన్ని చూపాయి.

భిన్న పార్టీలలో శత్రువులుగా ఉన్న అగ్రవర్ణ భూస్వాముల పెత్తనం కింద నలిగిపోతున్న దళితులందరినీ సమీకరించి ఎదిరించి గ్రామాల్లో మహిళా ఉద్యమాన్ని నడిపి అగ్రవర్ణ పురుషుల అహంకారానికి బలైపోయిన స్త్రీ కథ ఓల్గా రాసిన "ఆకాశంలో సగం" (1990) అనే నవలలో కన్పిస్తుంది. దళిత స్త్రీ నాయకత్వంలో స్త్రీలందరూ ఏకమై అగ్రవర్ణ భూస్వాములను ఎదుర్కోడం నవలలో ముఖ్య విషయం. బోయ జంగయ్య వ్రాసిన "జాతర' (1997), "మరో మార్పు' (2002), "జగడం" నవలలు తెలంగాణ దళితుల జీవితాన్ని వర్ణిస్తాయి. దళితులకు కావాల్సిందేమిటో ఎరిగి, అందుకు చేయాల్సిందేమిటో జగడం నవల స్పష్టంగా తెలియజేస్తుంది. దళిత స్త్రీలను జోగినులుగా మార్చడం, అగ్రవర్ణాలు దళితులపై దాడులను చేయడం తదితర అంశాలను ఈ నవలలో రచయిత చిత్రించారు. తెలుగు సమాజంలో, ఆ మాటకొస్తే భారత సమాజంలో గుణాత్మకమైన మార్పు తేవడానికి దళిత చైతన్యం ఎంతగా ఉపకరిస్తుందో బోయ జంగయ్య ఈ నవలలో స్పష్టం చేసారు. కేతు విశ్వనాథరెడ్డి "వేర్లు" నవల ముప్పయ్యేళ్ళ క్రితం విద్యావంతుడైన ఒక దళితుడి అంతరంగానికి అద్దం పడుతుంది.

జాలా రంగస్వామి రాసిన ''రైతుపిల్ల'' నవలలో అగ్రకుల భూస్వామి కూతురు తమ దగ్గర పాలేరుతనం చేస్తున్న మాల యువకుణ్ణి ప్రేమించి, పెళ్ళి చేసుకోవడం ఇందులోని ఇతివృత్తం. అరుణ "ఎల్లి" నవలలో ఎరుకుల కులంలో ఓలి పేరుతో స్త్రీని అమ్ముకునే విధానాన్ని నిరసించడం గమనించవచ్చు. కులానికి "లింగానికి - వర్గానికి సంబంధించిన అధికార సంబంధాలను పలు కోణాల్లోంచి ఈ నవల చక్కగా విశదీకరించింది. గ్రామాల్లో అట్టడుగు వర్గాల్లో స్త్రీలను, ఆసాములు కామానికి మాతంగినులుగా, బసివినిలుగా ఎలా బలితీసుకుంటారో వి.ఆర్.రాసాని తన "మట్టి మనుష్యులు" నవల్లో వెల్లడించారు. స్పార్టకస్ కలం పేరుతో జి. రామమోహన్ రావు రాసిన "ఖాకీ బతుకులు" నవలలో దళితుడు ఏ వ్యవస్థలో వున్నా వివక్షను ఎదుర్కోక తప్పడం లేదని ప్రకాశం, సూర్య పాత్రల ద్వారా నవలాకారుడు నిరూపిస్తారు. పోలీసు వ్యవస్థలోని ఆరాచక ధోరణులను ఈ నవల సమర్ధవంతంగా విప్పి చెప్పింది. కె.కె.మీన రాసిన "బాకి బతుకులు" నవల సంఘంలో సముచిత స్థానం కోసం, సదుపాయాల కోసం క్రైస్తవ మతంలోకి దళితులు వలసపోయిన చారిత్రక సత్యాన్ని బహిర్గతం చేస్తుంది.

కాలువ మల్లయ్య "నీ బాంచెన్ కాల్మొక్తా" (1987) నవలలో సుమారు యాభై ఏళ్ళలో తెలంగాణలో వచ్చిన సామాజిక పరిణామాలను ప్రాంతీయ మాండలికంలో వివరించే ప్రయత్నం చేశారు. ఆయన కలం నుండి వెలువడిన "బతుకు పుస్తకం" నవల కూడా దళితాభ్యుదయాన్ని ప్రబోధిస్తుంది. సదానంద శారద "మంచినీళ్ళ బావి" (1992) తెలంగాణ ప్రాంతం దళిత జీవితాలను వర్ణించింది. బండి నారాయణస్వామి "గద్దలాడతాండాయి" (1996) నవలలో రాయలసీమ దళితుల జీవితాన్ని చిత్రించారు. మాలమాదిగల మధ్య అంతరాలను, అనాదిగా వస్తున్న పంతాలను ఆసరాగా చేసుకుని తమ రాజకీయ ఆర్థిక ప్రయోజనాల కోసం అగ్రవర్ణాల వారు ఉపయోగించుకోడం మామూలు కథే అయినప్పటికీ ఏభై ఏళ్ళ కాలాన్ని నవలలో ఇనుమడింపచేస్తూనే, గత పదేళ్ళ కాలంలో గ్రామాల్లో చోటుచేసుకున్న పరిణామాలను నన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి "కాడి" (1998) నవల విశ్లేషిస్తుంది. నాసరయ్య ఇంచుమించు ఇదే ఇతివృత్తంతో "మాదిగ పల్లె" (1998) అనే నవలను వ్రాశారు. దళితులను చైతన్యపరిచి, వారిని సంఘటితపరిచే ప్రయత్నం ఒక వైపు జరుగుతుంటే, వీరిని విడదీసి బలహీనుల్ని చేయడానికి పెద్దలు ఎటువంటి కుట్రలు పన్నుతున్నారో ఈ నవల తెలియజేస్తుంది.

చిలుకూరు దేవపుత్ర రాసిన అద్దంలో "చందమామ' (1988), "పంచమం" (1998) నవలల్లో రాష్ట్రంలో జరిగిన దళిత ఉద్యమాల చారిత్రక నేపథ్యాన్ని చిత్రించే ప్రయత్నం చేశారు. దళితులు అచేతన దశ నుంచి హక్కుల కోసం ఉద్యమించే స్థితి వరకు గల క్రమ పరిణామాన్ని ఈ నవల సవివరంగా తెల్పింది. గత శతాబ్దం ఎనిమిదో దశకానికి ముందట జరిగిన భూసంస్కరణలు మొదలుకొని మాదిగ దండోరా" మాల మహానాడు వరకు గల పరిణామాలను ఈ నవల చిత్రించింది. సామాజిక చైతన్యం లేని ఉన్నతోద్యోగాలు, రిజర్వేషన్ తో వచ్చిన రాజకీయ పదవులు దళితులను బాగు చేయలేవని నిరూపించిన నవల ఇది. దీనిలో సుమారు యాభై సంవత్సరాల దళిత జీవితం, సామాజిక వాస్తవికతకు నిలువెత్తు నిదర్శనం ఈ నవల. దేవపుత్ర వ్రాసిన మరో నవల అద్దంలో చందమామ నవల భూమి సమస్యను ప్రధానంగా చర్చించిన నవల.

***వేముల ఎల్లయ్య తాను రాసిన "కక్క" (2000), "సిద్ధి" (2006) నవలల్లో తెలంగాణ ప్రాంత దళితుల సాంస్కృతిక జీవనాన్ని ప్రాంతీయ మాండలికంలో రాశారు. కక్క నవల తెలంగాణా లోని మాదిగల జీవనశైలిని వారి యాసలోనే వ్యక్తీకరించింది. మాదిగల భాష, సంస్కృతి, ఆచార వ్యవహారాలు ఈ నవలల్లో బాగా కన్పిస్తాయి. పాలేరు జీవితంతో తృప్తిపడని ఓ మాదిగ యువకుడు, కులవృత్తివేపు మళ్ళడం నవలకు ఆయువుపట్టు. దళితుడి ఆత్మగౌరవానికిది నిక్కమైన***

కొలకలూరి ఇనాక్ రాసిన "అనంతజీవనం" నవలలో భిన్న ప్రాంగణాల దళిత వ్యధ వుంది. పరిష్కార సాధనా ఉంది. అస్తిత్వ చైతన్యం వుంది. ఆయన మరో నవల "సర్కారు గడ్డి" లో తమ హక్కును రక్షించుకోవడంలో దళిత కుటుంబం సాధించిన సమన్వయించిన శక్తియుక్తులు, శారీరక శ్రమ విజయంతో ఆర్థిక పీడనను అధిగమించిన దళితుల సామర్థ్యం నిరూపించబడ్డాయి. ఇనాక్ చేతి నుండి జాలువారిన "సమత', "అనాథ', "ఇరులలో విరులు', "ఎక్కడుంది ప్రశాంతి?" నవలల్లో అనాథలు, హరిజన విద్యార్థినీ విద్యార్థుల అభివృద్ధి, హరిజన క్రైస్తవ జీవితాల పరిణామాలు, పరిస్థితుల ప్రాబల్యంలో హరిజనుల ప్రేమ, ఔదార్యం, వైశిష్ట్యం "సద్గుణాల భగ్నత కనిపిస్తాయి. అనంతపురం జిల్లా సామాజిక రాజకీయ చరిత్రకు ప్రతిబింబం స్వామి రాసిన "మీ రాజ్యం మీరేలండి" నవల. అందివచ్చిన అవకాశాలను చేజిక్కించుకుని, మతాలు మార్చుకుని, కులస్వభావాన్ని భద్రంగా అంటిపెట్టుకుని రెండు అగ్రవర్ణాల వారు ఏవిధంగా దళితుల్ని కీలుబొమ్మలుగా చేస్తున్నారో ఈ నవల నిరూపించింది.

జి. కళ్యాణరావు "అంటరాని వసంతం" (2000) నవల ఈ శతాబ్దం చివరి దశకంలో వచ్చిన గొప్ప నవల. ఎనిమిది తరాల దళితుల సాంఘిక, సాంస్కృతిక, ఆర్థిక పోరాటాలకు ఈ నవల అద్దం పడుతుంది. సాంస్కృతిక రంగాలలో దళిత ప్రతిభ ఇతరులకు ఏమాత్రం తీసిపోదని ఆ నవల నిరూపించింది. దళితులు క్రైస్తవంతో మమేకం కావడానికి గల కారణాలను ఈ నవల విశ్లేషించింది. సుమారు వంద సంవత్సరాల దళితుల పోరాటాల పరిణామాలను ఆకర్షణీయమైన శైలిలో రచయిత వ్రాసిన తీరు ప్రశంసనీయం. ప్రవాహ సదృశ్యమైన భాష, కనులు మిరుమిట్లు గొలిపే తరంగాల వంటి కవిత్వ శైలి ఈ నవలను ఆధునిక మహేతిహాసంగా నిలబెట్టాయి. వేముల ఎల్లయ్య తాను రాసిన "కక్క" (2000), "సిద్ధి" (2006) నవలల్లో తెలంగాణ ప్రాంత దళితుల సాంస్కృతిక జీవనాన్ని ప్రాంతీయ మాండలికంలో రాశారు. కక్క నవల తెలంగాణా లోని మాదిగల జీవనశైలిని వారి యాసలోనే వ్యక్తీకరించింది. మాదిగల భాష, సంస్కృతి, ఆచార వ్యవహారాలు ఈ నవలల్లో బాగా కన్పిస్తాయి. పాలేరు

# మరోప్రపంచం

- బండారు చిన్న రామారావు
*9553330545*



వెండి వెన్నెల పూసే
సుందర నందనవనంలోకి
గుండె గుండె మీటుతూ
ప్రేమానురాగాల గీతం వింటూ
ఎండా, వానా అనకుండా
నిండు మనస్సుతో
ముందుకు సాగుదాం
అక్కడ అన్నీ అందాలే
మనసు దోచే ఛందాలే
మంచి సుమగంధాలే

అక్కడ స్వరూపాన్ని చూడరు
స్వభావాన్ని కొలుస్తారు
కులం అడగరు
వ్యాకులం తొలిగిస్తారు
మతం అడగరు
మానవత్వం పండిస్తారు
అదే
మహాత్ములు కలలుగన్న
మరోప్రపంచం!

---

జీవితంతో తృప్తిపడని ఓమాదిగ యువకుడు, కులవృత్తివేపు మళ్ళడం నవలకు ఆయువుపట్టు. దళితుడి ఆత్మగౌరవానికిది నిక్కమైన నిదర్శనం.

దళిత సమస్యకు మార్క్సిస్ట్ ఉద్యమాల సహాయం అవసరమని, దళిత బహుజన విముక్తికి వెలుగు దారి విప్లవమని చాటి చెబుతుంది గోపరాజు నాగేశ్వరరావు రాసిన "దండం మీద చిలకలు" (2001)నవల. మధ్య కోస్తాలో దళిత బహుజనులు వృత్తుల పరాయికరణ పొంది, దొరలకు కిరాయిహంతకులుగా, దళారులుగా మారడం, చాపకింద నీరులా విస్తరించిన పీపుల్స్ వార్ కార్యక్రమాల పట్ల దళితులు ఆకర్షితులవ్వడం ఇత్యాది అంశాలు కేంద్రంగా ఈ నవల నడుస్తుంది. రాయలసీమ ముఠా కక్షల నేపథ్యంలో వేంపెంట సంఘటన స్ఫూర్తితో వెలువడిన నవల పినాకపాణి రాసిన "నిప్పులవాగు" (2001). భూస్వామ్య సాయుధ ముఠాలు పోలీసుల వెన్నుదన్నుతో మాదిగల్ని సజీవ దహనం చెయ్యడం, మాలమాదిగల మధ్య ఉన్న వైరుధ్యాలను పెంపొందించడం... తదితర అంశాలతో విప్లవోద్యమం నుండి దండోరా వరకు ఈ నవల చిత్రించింది. దళితులపై కొనసాగే ఆర్థిక, లైంగిక దోపిడీలను వివరించడంతోపాటు దళితులలో వున్న మూఢ విశ్వాసాలను, వెనుకబాటుతనాన్ని భూతం ముత్యాలు రాసిన "సూర" నవల చిత్రీకరిస్తుంది. మాదిగ దండోరా నేపథ్యం నుంచి అది అల్లుకుంటున్న కాలంలో వున్న రాజకీయాల, పరస్పర ఘర్షణల ఫలితాల దుఃఖ తీవ్రతలకు నిలువుటద్దం వి. చంద్రశేఖర్ రాసిన "నల్ల మిరియం చెట్టు" నవల.

అట్లే పోల్కంపల్లి శాంతాదేవి "ప్రేమ పిచ్చి", ఆచార్య ననుమాసస్వామి "మోహిని" తదితర నవలలు కూడా దళిత చైతన్య నేపథ్యంతో వెలువడిన నవలలే. ఈ విధంగా ఎందరో రచయితలు నవలా ప్రక్రియలో దళితుల స్థితిగతుల్ని, వారి అవసరాల్ని, వారి కర్తవ్యాన్ని, ఇతరుల పట్ల మెలగాల్సిన తీరుతెన్నులను వివరిస్తూ రచనా వ్యాసంగాన్ని చేశారు. ఇంకా చేస్తూనే ఉన్నారు

జి.లక్ష్మీ నరసయ్య, శిఖామణి, కలేకూరి ప్రసాద్ లు దళిత సాహిత్యాన్ని విశ్లేషించేందుకు మంచి ప్రయత్నాలు చేశారు. 50 ఏళ్ళ భారత స్వాతంత్ర్యానంతరం దళితుల జీవితాల్లో చాలా మార్పులు చోటు చేసుకున్నాయి. ఈ మార్పులను దళిత రచయితలు సాహిత్యీకరించే ప్రయత్నం చేస్తున్నారు. ఆ విధంగా తమ ప్రత్యేకత సంస్కృతిని, సంప్రదాయాన్ని పదిల పరుచుకుంటున్నారు. ఇట్లు తమ జీవితానుభవాలను, తమ సంస్కృతి గొప్పతనాన్ని కనీస మాత్రంగా కూడా గౌరవించని సంప్రదాయ సాహిత్యం నుండి తమ జాతి పేరుతోనే ఒక ప్రత్యేక సాహిత్యాన్ని కొనసాగించే స్థితికి చేరుకున్నారు.

1996 తరువాత దళిత సాహిత్య విస్తృతి తగ్గుముఖం పట్టింది. దళిత వర్గీయుల్లో ఏర్పడిన విభేదాలు ఇందుకు కొంత కారణమయ్యాయి. ఎస్సీ వర్గీకరణ తరువాత మాదిగలు తమ సాహిత్యాన్ని ప్రత్యేకంగా రాసుకుంటూ తమ స్వీయ అస్తిత్వానికై ప్రయత్నిస్తున్నారు. ప్రస్తుతం పత్రికల్లో దళితవాద సాహిత్య ప్రచురణ బాగా తగ్గిపోయింది. 1990 ఆరంభంలో విస్తృతంగా వెలువడిన దళితవాద సాహిత్యం ఆ దశకం చివరి నాటికి తగ్గిపోయిందని చెప్పడం వాస్తవం. అయితే సైద్ధాంతికత్వం, అభివ్యక్తి, వస్తువు, భాష, శైలి తదితర అంశాలల్లో ఈ సాహిత్యం వేసిన ముద్ర చాలా కాలం పాటు అట్లాగే ఉంటుందని నిస్సందేహంగా చెప్పవచ్చు.

# ఉత్తమ కవిత్వాన్ని వినిపిస్తున్న నవయువ కంఠం




ఆ యువకవి ఆశ నిష్పలం కాలేదు. చొప్ప కట్టలు లేచాయి. ఒళ్ళు విరుచుకున్నాయి. కళకళ్ళాడుతూ తెల్లవారుతోంది. సాహిత్య సురభిళాలు సర్వత్రా వీస్తున్నాయి. కవిత్వం కోసం ఆ యువకుడు సాముగరడీ చేసినవాడు కాడు. తాలింఖానాలో చేరి, కసరత్తు చేయనివాడు. సాధుపుంగవులందరి మల్లేనే, ఉపాధ్యాయ వృత్తిని స్వీకరించాడు.

చంపావతీ పుణ్య తీర్థాలు సేవించాడు. ఇంతా చెప్పి, అతని పేరు "బాలసుధాకరమౌళి". కవితావస్తువులు అతనికి నేరుగా సమాజం నుంచే లభ్యమయ్యేవి. విప్పార్చిన కన్నులో విపులమైన జీవితం వికసిస్తుంది.

డా॥ అవంత్స సోమసుందర్
9347848905

మట్టి ఎన్నడూ నిర్జీవంగా పడి ఉండదు. కఠోరమైన ఇనుపబూట్లు నడచి, శాసనాస్త్రాలతో ఛిద్రం చేసినా, పుడమి ఒంగినట్టే ఒంగి తెలతెలవారే సరికే కొత్త చివుళ్ళతో కొత్త జీవాంకురాలతో కలకలలాడిపోతుంది. నిన్న శ్రీకాకుళం జిల్లాలో అదే జరిగింది. సాయుధ విప్లవానికి సమయం ఆసన్నమైందని నమ్మించిన కొందరు దుందుడుకు వాదులు మహేంద్రగిరికి నిప్పు ముట్టించారు. అదిగో విప్లవం అన్నారు. కానీ ఆ విప్లవం అణచబడింది. అంతలో ఇంక మేలుకోదని భావించిన ఆ మట్టి ఉత్తుంగమై లేచింది. అందరినీ పలకరించింది. మహేంద్రగిరి మట్లాడింది. అదే చైతన్యం నేడు సాహిత్య స్వరూపాలలో వికసిస్తోంది. సిద్ధాంతాలు గాలిలోంచి మొదలయ్యాయి. విప్లవాలకు బండరాళ్ళు కదలవు. నిద్రిస్తున్న యేరుల స్వప్నాలలోంచి, సాహిత్యం మేలుకుంటుంది. నాగావళి, వంశధార నదులు నిద్రపోలేదు. జరిగిన కథలను, తరగ తరగకీ కలగా నిలుపుకుంటూనే ఉన్నాయి. ఆ మహానదుల మట్టిలో సాహిత్య రసభావాలు విలీనమయ్యాయి... ఆ నదీ జలాల రసమాధుర్యంతో జాలిపాటలై మోగుతూ ఉంటాయి. కానీ చెంపావతి చంపకసుమాల తోరణాలతో పరిమళాలీనుతూ స్వాగతాలందిస్తోంది. ఆ స్వాగత కంఠాల నుంచి ఒకానొక యువకంఠం మేలుకుంది.

"ఎగరడానికి ఇదే సమయం" అంది. కావాలిస్తే రెక్కలు విప్పి చూసుకోమంది. పిట్ట పిల్లలన్నీ చూసుకున్నాయి. ముక్కులతో కెక్కిరించుకున్నాయి. లేచి నిలబడ్డాయి. యువకంఠం హెచ్చరించింది. పక్షుల్ని కాదు. చొప్పకట్టల్లా పడి ఉన్న మనుషుల్ని ఎగిరే సమయం వచ్చిందనీ ఆశించింది. ఆ యువకవి ఆశ నిష్పలం కాలేదు. చొప్ప కట్టలు లేచాయి. ఒళ్ళు విరుచుకున్నాయి. కళకళ్ళాడుతూ తెల్లవారుతోంది. సాహిత్య సురభిళాలు సర్వత్రా వీస్తున్నాయి. కవిత్వం కోసం ఆ యువకుడు సాముగరడీ చేసినవాడు కాడు. తాలింఖానాలో చేరి, కసరత్తు చేయనివాడు. సాధుపుంగవులందరి మల్లేనే, ఉపాధ్యాయ వృత్తిని స్వీకరించాడు.

చంపావతీ పుణ్య తీర్థాలు సేవించాడు. ఇంతా చెప్పి, అతని పేరు "బాలసుధాకరమౌళి". కవితావస్తువులు అతనికి నేరుగా సమాజం నుంచే లభ్యమయ్యేవి. విప్పార్చిన కన్నులో విపులమైన జీవితం వికసిస్తుంది.

కవుల ఆలోచనల్లో చేతుల్లో కనిపించని శ్రమ సౌందర్యపు పూలుంటాయి అని అనుభవం మీద చెబుతున్నాడు. తాజాగా

విచ్చుకున్న కవితా హృదయంలో లోకాన్ని వేకువ కన్నులతో చూస్తున్నాడు.


బాలసుధాకర మౌళి

"కవులు, పిల్లలూ ఏ దేశానికైనా ప్రాణవీచికలు" పిల్లల్లాగే కవులు మృదు మనస్కులు. కనుకనే వృత్తిపరంగా, మౌళి ఉపాధ్యాయుడే అయినా "నేల రాలిన నెత్తుటి పుష్పాల" చైతన్యదీప్తిని రక్తంలోకి ప్రవహింపచేస్తున్నాడు. ఉపాధ్యాయుడంటే మొక్కు తీర్చుకుంటూ జీతం అందే తేదీవేపు నడచి వెళ్ళిపోవడం కాదు. ఉపాధ్యాయుని సామాజిక బాధ్యత ఎరిగినవాడు కనుకనే కవిగా పరమోత్కృష్టమైన బాధ్యత స్వీకరిస్తున్నాడు. తరగతి గది "రక్తం చిందే వెయ్యి కన్నులనేల" ఈ రక్తం జీవచైతన్యంతో తల ఎత్తుతుంది. గానమై ఉప్పొంగుతుంది. స్వప్నమై విహరిస్తుంది.

చైతన్యమూ, సత్య సంధతా, ఉన్న నేటికాలపు యువకులంతా, క్యూబా ప్రగతిని కేస్ట్రో ధీర హృదయాన్నీ ప్రస్తుతిస్తూనే ఉన్నారు. అట్టి వారితో తన హృదయాన్ని తాదాత్మ్యం చేస్తున్నాడు మౌళి.

కొన్ని పద్యాలు అభివ్యక్తి కోసం, పదచిత్ర శిల్పం కోసం, భావుకతా స్వచ్ఛత కోసం నిరీక్షిస్తూనే ఉన్నాయి. అవును, మరి మూడు దశకాల పసివాడు ఆలోచనల్లో స్వచ్ఛత ఉంది. నిరంతర కవితా సాధన వల్ల భవిష్యత్తులో మిగిలిన నుగుణాలన్నీ తప్పక సాధిస్తాడు.

నిజమే ఈ భూమ్మీద పుట్టిన ప్రతీదీ పారిపోతూనే ఉంది. నిన్నటి చరిత్రను, మిగల్చకపోవడం భూమి మీద పుట్టిన సుందర దృశ్యాలను చరిత్రయే లేదన్న భ్రమలో వర్తమానులు పడుతూంటారు. కానీ నది మాత్రం ఏ ప్రాచీన లోకాల నుంచో, నేటివరకూ ప్రవహిస్తూంటుంది. అలల చేతి వేళ్ళతో నాట్య భంగిమలు ప్రదర్శిస్తుంది. ఎన్నో గాథలను వివరిస్తూంటుంది. ఈ దేశంలో ప్రవహిస్తున్న నదులన్నీ రసవాహినులే. గుండెలు లేని బండరాళ్ళు కాదు. జీవరహితమైన మంచు గడ్డలూ కాదు. స్వయం శక్తి సంకల్పంతో మన మహానది వికసిత పుష్పాలంకార మాంత్రిక హస్తంతో నదిని మహానదిని చెయ్యెచ్చు అంటాడు కవి.

కొన్ని పద్యాలు అభివ్యక్తి కోసం, పదచిత్ర శిల్పం కోసం, భావుకతా స్వచ్ఛత కోసం నిరీక్షిస్తూనే ఉన్నాయి. అవును, మరి మూడు దశకాల పసివాడు ఆలోచనల్లో స్వచ్ఛత ఉంది. నిరంతర కవితా సాధన వల్ల భవిష్యత్తులో మిగిలిన సుగుణాలన్నీ తప్పక సాధిస్తాడు. ఈ సంపుటిలోని కవితలన్నీ తేరిపార పరికించినవి కావు. కొన్ని చేర్చబడకపోయినా కవిత్వానికి హాని జరగదని అనిపిస్తోంది.

పసిబిడ్డ పాదాలను మౌళి కవిత రాశాడు. అతని భావుకత మెచ్చదగినదే; కాని, సమంజసత్వం లోపించడం గుణం కాదు. పసిబిడ్డ పాదాల నుండి ఆకలి లోకాల వరకూ కవి భావనా విహంగం ఎగరడమే కానీ, తిరిగి ఒక గమ్యాన్ని చేరుకోవడంలో కవి ఇబ్బంది పడ్డాడు. కవితా వస్తువుకు అనుకూల వాతావరణం సృష్టించుకోవడంలోనే కవి వివేకం బయటపడుతుంది. రవీంద్రుడు పసిబిడ్డ పాదాలను గురించి కవిత రాశాడు. దానిలోని మన కవి క్షుణ్ణంగా అధ్యయనం చేస్తే, ఎగరవలసిన తావులు, దిగవలసిన స్థావరాల మధ్య అఘాతాలుండవు. రవీంద్రుడి కవిత క్రిసెంట్‌మూన్‌లో ఉంది. నెలబాలుణ్ణి పసిపిల్లలకు సంకేతంగా వాడతాడా కవి. చంటిబిడ్డ గురించి - పాబ్లోనెరుడా - అనే కవితలో 14 పంక్తుల అత్యద్భుత గీతం రచించాడు. నిషిద్ధాలు - పాదాలను కూడా పునరాలోచించుకోవలసినదే. మౌళి కవిత్వంలో ప్రతిభ వర్తమాన కవిత్వోన్నతికి దోహదం చేస్తాయి. ఉత్తమ భావుకత ద్యోతకమవుతున్నది.

ఆనందం - అభివ్యక్తిలోని పదచిత్రాల మైత్రి ఎంతవరకూ సమంజసత్వమో ఆలోచించాలి. పాఠకుడి ఏకాగ్రతను బంధించకపోతే, కవిత విజయం పొందినట్లు కాదు.

సూర్యుణ్ణి అరచేతిలో ముట్టి అరణ్యాలను రగిలించగలరు. అరణ్యాల ఆకలి మంటలు కీలల నుంచి వేణువును సృష్టించగలరు. వేణువు గొంతే కోయిల పాడే గీతాన్ని సృజంచగలరు. అంటూ సంఘజీవి అగు మానవుడు నెరవేర్చగల కర్మణ్యత్వాన్నీ సాధించవలసిన విజయాలనూ ఏకదేశంగా ప్రస్తుతిస్తాడీ కవి. మానవశక్తిని , అవగాహన చేసుకోవడం, మంచి సంగతే; దాని ఫలితార్థం కూడా వాంఛనీయమైనదే; పరాన్న భుక్తుల ఆకలిని, దాహాన్నీ అంతమొందించడమే జీవన్ముక్తిగా భావిస్తున్న మానవశక్తి అజేయమైనదేనని కవికి అవగాహన ఉంది.

ఈ కవి రైల్లో... అనే శీర్షికతో - నాలుగు కవితలు రాశాడు. అందులో - జీవితాన్ని చిత్రించాడు. ప్రయాణీకులకు తోడుగా కొందరు వీధి గాయకులు కూడా సహకరిస్తూంటారు.

వాళ్ళు టికెట్టు లేని ప్రయాణీకులనీ అడుక్కుందుకు వచ్చారనీ మనం చిన్న చూపు చూడనక్కరలేదు. తన పాటతో మన చింతల్నీ, చీకాకుల్ని అరికడుతున్నందుకు ధన్యవాదాలర్పించవలసిందే.

సూర్య చంద్రుల్ని ధ్యేయంగా గానమే ఊపిరిగా సహయాత్రికుడవుతాడు. అతడు నిజంగా యోధుడు. రైల్లో అస్తవ్యస్తంగా పడి ఉన్న దేశ పటాన్ని కలిపి కుడుతున్నాడు. భారతదేశంలో ఉన్న జాతులు, మతాలూ, కులాలూ, చెత్తా చెదారాలనూ ఏకదృష్టిగా ఉన్న గాయకుడు సమన్వయంతో అన్ని కులాలకూ సాంత్వన కలిగిస్తున్నాడు.

బాలసుధాకరమౌళి ఎంతో కవితోత్సాహం కలవాడు తన తొలి కవితా సంపుటి ఎగరాల్సిన సమయంలో 73 కవితలను సంకలితం చేశాడు. ధరలు ఆకాశంలో తప్ప, ధరణికి దిగిరావు. ఈ గడ్డు కాలంలో, కవితలను ఎన్నిక చేసుకునేటప్పుడు కనీసం రెండు మూడు సార్లైనా రివైజ్ చేసుకోవాలి. మంచి కవితలలో దొంకల్లో పెరిగే వరన్థలాలు వ్యాపిస్తాయి. వాటిని జాగరూకతతో పరిశీలించుకుని ఖండించుకోవాలి. లేకపోతే కవితోద్యానవనాలు దుర్గమారణ్యాలకు పోతాయి. కనుకనే కవికి జాగరూకత అవసరం. సమాధానం తప్పని సరిగా చెబుదామనుకుని ఈ బాధ్యత తీసుకున్నాను. కవిత్వాన్ని సవిమర్శకంగా, విమర్శించేవాళ్ళు అరుదై పోతున్నారు. కవినీ, దాని వెనకాల కృషినీ అహోరాత్రాలు ధ్యానించి శ్రమిస్తున్నప్పుడు, ఆ శ్రమకు తగిన ఫలితార్థం ఉండాలి.

**అమానుషత్వం పీడకరంగా విజృంభించిన దేశదేశాల, నిజ స్వరూపాన్ని సాక్షాత్కారం పొంది కవితలు ఆలపించినది మొదటిసారిగా మా తరమే. మా ముందు శ్రీశ్రీ పీడిత మానవుని జాగృతి కోసం మొదటిసారి గానం చేయడం నాకు ఎంతో ఉత్సాహాన్ని కలిగించింది.**

శ్రమజీవనుల జీవితాలన్నీ దాదాపు ఒక్కలాగే ఉన్నాయి... వివరాలలోనే విభేదం. బెస్తవాళ్ళు ఫ్యాక్టరీ కార్మికులకంటే భయంకర జీవితం గడుపుతుంటారు. నిత్యం మృత్యుముఖం వరకూ వెళ్ళొస్తూంటారు...

పదిహేడేళ్ళ యౌవనపు ముఖం మీద ఆకలి మృగం దాడి చేసిన గుర్తు. ఆకలి మృగం దాడిలో నేటి ప్రపంచ జనాభా కనీసం సగం మందైనా అల్లల్లాడుతున్నారు. ఆ భయంకర మృగం కనిపించిన కండలన్నింటినీ పీక్కు తినేస్తుంది. మౌళి తన కవితలలో క్షుదా పీడితుని ముఖచిత్రం ప్రదర్శించాడు. గాయపడ్డ తెలంగాణా గురించి, సానుభూతితో ఈ కవిగేయం రాశాడు. దుస్సహ జీవిత చిత్రాలను ప్రదర్శిస్తూంటే పాఠకుడికి నిట్టూరుస్తూ ముందుకు సాగక తప్పడం లేదు....

మనిషి ప్రాదుర్భవించింది అరణ్యంలోనే పెరిగి, పెరిగి ఎన్నో ప్రయోగాలను సలుపుతూ నాగరీకులయినది అరణ్యంలోంచే. కానీ నాగరీకులయిన తర్వాత ఆ అరణ్యాన్ని తల్చుకుంటేనే కంపించిపోతాడు. దానికి కారణం ఈ నాగరికతే శాశ్వతమనుకోవడం..... భ్రమలు వాస్తవరూపం పొందే వరకూ బాగానే ఉంటాయి. తర్వాతనే వాటి నిజ స్వరూపం భయోత్పాతం కలిగిస్తాయి. మొత్తానికి మౌళి కవితలలో ఎంతో వైవిధ్యముంది. బహువర్ణ శోభితమైన చిత్రులన్నాయి అది చాలదా?

తీహార్ మారకలు అనే రచన భారతదేశాన్ని కలవరపెట్టింది. అలాంటి వస్తువు తీసుకున్నప్పుడు కవిత మరికొంత సీరియస్‌గా రాయవలసి ఉంటుంది. లేకపోతే వస్తువుకీ, రచనకీ సమన్వయం దొరకక ఉత్త బుడగలా పేలిపోతుంది.

పశ్చిదేశాల ఆంక్షల ఉరితాళ్ళ ఊచల మధ్య గిరగిరలాడుతున్న గాజాలో అమలు జరుగుతున్న దుస్సహ పీడన వర్ణించిన తీరు పరిశీలించుకుంటే నేడు తీహార్ మరకలపై ఈ కవి గీతం గురించి నా అభిప్రాయం తేటతెల్లమవుతుంది. ఎంత దూరంలో మానవ హింస జరుగుతోందని కాదు. అట్టి కర్కశ మానవహింస మాత్రం వర్తమాన కవులకు అవశ్యం ఆలోచనార్హమే. కనుకనే పాలస్తీనాలో జరుగుతున్న హింస, అమానుషత్వం ఎక్కడ దర్శనమిచ్చినా ఆధునిక కవి, తన బాధ్యతగా గొంతెత్తుతాడు. అదే చైతన్యం పంచుకుంటున్నాడు మౌళి.

అమానుషత్వం పీడకరంగా విజృంభించిన దేశదేశాల, నిజ స్వరూపాన్ని సాక్షాత్కారం పొంది కవితలు ఆలపించినది మొదటిసారిగా మా తరమే. మా ముందు శ్రీశ్రీ పీడిత మానవుని జాగృతి కోసం మొదటిసారి గానం చేయడం నాకు ఎంతో ఉత్సాహాన్ని కలిగించింది. మా తరం కవులందరూ ఆనాటి తెలంగాణా వీరోచిత పోరాటాన్ని కీర్తించిన వాళ్ళే చిత్రించిన వాళ్ళే, ఆక్రోసించినవాళ్ళే ముఖ్యంగా నా గురించి చెప్పాలంటే దొడ్డి కొమరయ్య విసునూరు దేశ్‌ముఖ్ ప్రతాపరెడ్డి, తల్లి జానమ్మ కొమరయ్యను చంపింది. ఆ సంఘటన జరిగిన మర్నాడే కమ్యూనిస్టు దినపత్రిక ప్రజాశక్తిలో ఈ ఉదంతాన్ని

కొమరయ్య ఫొటోతో సహా చూసి, కదలిపోయాను. మర్నాటి రాత్రే ఖబడ్దార్ గీతం రాశాను. ఆ ఊపులో చాలా పాటలు రాశాను. కానీ అందులో 6 మాత్రమే సెలక్ట్ చేసి పునర్నిర్మించి ప్రచురించాను. 49లో నా వజ్రాయుధంలో తెలంగాణా గురించి ఆరుగీతాలే తీసుకొచ్చాను. తెలంగాణా కవి దాశరథి ఆంధ్ర మహాసభ మీటింగుల గురించి పాటలు రాయగా పాడి మీటింగులకు ఆహ్వానిస్తున్నారు. సామాన్య జనంలో అక్షరాస్యుల సంఖ్య అతి తక్కువ కావడం వల్ల ఆంధ్ర మహాసభ ఈ ప్రయోగం చేసింది. తర్వాతనే అతడు అరెస్టుకావడం, నిజామాబాద్ జైలులో నిర్బంధం కావడం, ఆ జెయిలుగోడలపై నిజాము రాజు జన్మజన్మాల బూతు అని ఆనాటి నైజాము రాజు రాక్షస పాలన నుండి విముక్తం కావాలని చేసిన పోరాటమే ప్రత్యేక తెలంగాణా రాష్ట్ర నిర్మాణం కోసం ప్రజలందరినీ ఏకం చేసిన విముక్తి గీతమయింది. తెలంగాణా ప్రజానీకం ప్రసరించిన తేజస్సు నేటి యువకులలలో సైతం ఉత్సాహపరుస్తూనే ఉంది. సుధాకర్ మౌళి తెలంగాణాపై హృద్యమైన గీతం రచించడానికి అదే కారణం.

చరిత్ర చీకటి కోణాలను దృశ్యీకరించబడుతున్న నకల ప్రాంతాలనూ సర్వ వీరులనూ ఈ కవి స్మరిస్తూనే ఉన్నాడు. "ఆమె కన్నుల్లో ఒక్కో పువ్వు రెమ్మల్ని రాల్చేస్తున్న దృశ్యం పోయి, వెన్నెల విరగ కాస్తుంది అనడం భావుకుడైన కవికే చెల్లింది .

కానీ ఇతడి కవితల్లో సంఖ్యాబలం ఉన్నంత కవితా గుణధారుఢ్యం సన్నగిల్లిందనే చెప్పాలి. కొన్ని కవితలలో అన్వయక్లిష్టత స్పష్టంగా కనిపిస్తుంది కొన్ని కవితలలో పునర్విచారణ మృగ్యమైంది. కొన్ని పంక్తులలో వాక్య నిర్మాణం సజీవంగా భాసించలేదు.

మొదట కృతయత్నే సాఫ్యలతలోనే మానవులకు ఎంత విజయానందం కలుగుతోందో శ్రమాపజయం నిష్ఫలితమై అతనిలో అంత విషాదాన్నీ ప్రోది చేస్తుంది. అయినా శిల్పులు పుడుతూ ఉంటారు. కృషి సల్పుతూనే ఉంటారు. ఒక్కొక్కప్పుడు కృషి ఫలించనప్పుడు దఃఖం కలగవచ్చు. కానీ అదే శాశ్వతం కాదు. మానవజాతి పురోగతి విజయం వైపే సాగి వస్తోంది.

"సముద్రాన్ని ఆవాహన చేస్తున్న నేలగుండెలవి" అవి ఇనబింబాలు ఆత్మార్పణ చేసేవాళ్ళు అనుయాయులు కూడా. అమరవీరులే. వారే సత్ఫలితాల వారసులు అసమ్మతి చర్యలను, భస్మం చేసే స్వార్థపర వర్షాల గాధలను కవి సానుభూతితో నాలుగైదు రచనలు చేశాడు.

కవి పరస్థలాలు చెక్కేసుకోవాలి. సవరించుకోవాలి. ఏం రాశాను? ఎలా రాశాను..? ఏమిటి రాశాను? అని త్రిగుణ్మాతకమైన ప్రశ్నలతో తన సమీక్ష శోధించాలి. అప్పటికిగాని రివిజన్ పూర్తవదు. అదే ప్రాణతల్యమైనది. సకల కళాశోభితమై రాణిస్తుంది. కవితలన్నీ పాఠక హృదయంలో లేక శ్రోత హృదయంలో నిరంతరం జీవిస్తాయి.

యువ హృదయ ప్రతిభా సముత్సేకం అదే చోదకశక్తి, దాని ఆవిష్కరణలు బహుముఖి కవితాశక్తి జలగా పుట్టి, తరంగమై లేచి, ప్రళయ్ధనితో విజృంభిస్తుంది. మిత్రులందరికీ సుధాకరమౌళి స్ఫూర్తినిచ్చాడు.

*చి॥ బాలసుధాకరమౌళి ప్రధమ కవితా సంపుటి "ఎగరాల్సిన సమయం" సమకాలానికి అందినట్టుగా సంతృప్తి కలిగించింది. హృదయ పూర్వకంగా ఈ కవిని ఆశీర్వదిస్తూ అభినందిస్తూ తన కవితారచనా కృసి నిరంతరాయంగా సాగాలని ఉత్తమ భవిష్యత్తు కలగాలని మనసారా అభినందిస్తున్నాను.*

చి॥ బాలసుధాకరమౌళి ప్రధమ కవితా సంపుటి "ఎగరాల్సిన సమయం" సమకాలానికి అందినట్టుగా సంతృప్తి కలిగించింది. హృదయ పూర్వకంగా ఈ కవిని ఆశీర్వదిస్తూ అభినందిస్తూ తన కవితారచనా కృసి నిరంతరాయంగా సాగాలని ఉత్తమ భవిష్యత్తు కలగాలని మనసారా అభినందిస్తున్నాను.

ఈ కవి యువకంఠంలో భవిష్యత్ మానవశాసనం ఇలా ప్రగల్భిస్తోంది.

"స్త్రీలు కచ్చితంగా రాజ్యాధికారంలోకి రాక తప్పదు

న్యాయ బద్ధమైన ధర్మ బద్ధమైన పాలన ఈ నేల మీద జరుగుతుంది.

కలలు కథలూ, ఊహలూ నిజమే అవుతాయట" వంటి పరిశుద్ధమైన ఆశావహ వాక్యాలతో ఈ కావ్యం భవిష్యత్తును విలోకిస్తోంది.

"అరణ్యానికి నీ కళ్ళని ఇవ్వు

నీ అణువణువునూ సమర్పించు" అంటూ ఈ యువకవి చిత్తశుద్ధితో ఆహ్వానం పలుకుతున్నాడు. అందరి ఆలోచనలూ ప్రేరేపిస్తున్నాడు.

# అనల చిత్రమ్

- మామిడి హరికృష్ణ
9908844222



జీవితం చిన్నది- జ్ఞాపకం పెద్దది
ప్రపంచం స్థల నియతం- ప్రశ్న కాలాతీతం
అనుభవం సంక్షిప్తం- ప్రేమ అనంతం

ఈ లోకం నిండా కనికట్టుల అందాలే
మరి నేను నిన్నే ఎందుకు ప్రేమించాలి?
ఈ జీవితం నిండా వేన వేల అనుభూతులే
అయినా, నేను నీ జ్ఞాపకాన్నే ఎందుకు నెమరేసుకోవాలి ?

మీ అమ్మలోని ఏ పార్శ్వాన్నో
నీకు స్ఫురణకు తెచ్చింది కనుక
అన్నాడో తాత్త్వికుడు..
ప్రకృతిలోని ఏ సంపూర్ణ భావననో
నీకు కలిగించగలిగింది కనుక అన్నాడో నేచురలిస్ట్ ...
పూల లోని ఏ సౌకుమార్యాన్నో
నీ స్పర్శలోకి తెచ్చింది కనుక అన్నాడో అనుభూతివాది...
మనిషిలోని ఏ ఆదిమ సహజాతాన్నో
నీ నుండి వెలికి తీసింది కనుక అన్నాడో ఆంత్రోపాలజిస్ట్ ....
నీ దేహం లోని ఏ సుఖ తంత్రికో రాగాలను కూర్చింది కనుక
అన్నాడో ఫిజియాలజిస్ట్....

ఈ విశ్వమంతటా సౌందర్యమే
అయినా నేను, నిన్నే ఎందుకు ఆరాధించాలి?

దేవతల్లోని ఏ అతీత శక్తినో
నీ ముందు ప్రదర్శించింది కనుక అన్నాడో థియాలజిస్ట్ ....
ఋషులలోని ఏ సృజన శీలతనో
నీలో సృష్టించింది కనుక అన్నాడో ఆధ్యాత్మిక వేత్త...
ఆకాశంలోని ఏ అనురాగాన్నో నీపై కురిపించింది కనుక
అన్నాడో కవి....
వాన జల్లులలోని ఏ ఆత్మీయతనో నీలో సంచలించేలా
చేసింది కనుక అన్నాడో సైంటిస్ట్ ....
అగ్నికీలలోని ఏ ఉద్దీపన శక్తినో నీకు ధార పోసింది కనుక
అన్నాడో ఉద్యమకారుడు....
మట్టి నేలలోని ఏ సహన గుణాన్నో నీకు పాఠంగా చెప్పింది
కనుక అన్నాడో రైతు....
గాలి తారంగం లోని ఏ ఊపిరినో నీకు అంకితం చేసింది
కనుక అన్నాడో మెట్రాలజిస్ట్....

ఎగురుతున్న సీతాకోకచిలక మనసుకి
పూల తోటై పలకరించింది కనుక
అన్నాడో చిత్రకారుడు....
పరుగెత్తుతున్న నీ ఆలోచనల సెలయేరుని
మైదానమై హత్తుకుంది కనుక
అన్నాడో గాయకుడు...
నీలోని నిన్ను అద్దం లా చూపెట్టింది కనుక
అన్నాడో సైకాలజిస్ట్...
నీలో నిద్రాణంగా ఉన్న ప్రేమను తట్టి లేపింది కనుక
అన్నాడో పర్సనాలిటీ డెవలప్ మెంట్ ట్రెయినర్...
తనని ప్రేమించడమంటే
నిన్ను నువ్వు ప్రేమించుకోవడమే అనే సత్యాన్ని
నీ అనుభవం లోకి తెచ్చింది కనుక
అన్నాడో ప్రేమికుడు.....

ఏది నిజం- ఏది అనిజం?
ఏది ఖనిజం- ఏది సుమ రజం ?
ఏది హాలాహలం- ఏది సుఖ బిలం?

జీవితం గొప్పది
జ్ఞాపకం ఓ నిశ్చల..!

ప్రపంచం విస్తారమైంది
ప్రశ్న ఓ చంచల...!!

ప్రేమ పరుసవేది
అనుభవం ఓ అనల.....!!!

కథ

# సజీవ దహనం

- కర్ణకోట రవీంద్రనాథ్



"రాములు బావా ! రాములు బావా లెవ్వలేదే? లెవ్వు" రాములు తలుపు తీసి చూసాడు. ఎదుట నర్సయ్య, అతని పదేండ్ల కూతురు. ఎండాకాలం ఉదయం బారెడు పొద్దెక్కింది. ఎండ చిట చిట లాడుతుంది.

"ఏంది నర్సయ్య బావ!"

"పిల్లకు కక్కుడి కాల్వకయింది. ఇంత మంతరియ్య రాదా!"

"సరే అద్దగంట అయినాక ఇన్ని ఉప్పురాళ్ళు తీసుకొనిరా. అప్పటి వరకు నేను ముఖం కడుకుంటా!"

అద్దగంట అయినాక ఉప్పురాళ్ళతో బిడ్డను తీసుకొని వచ్చాడు. రాములు పిల్లను ముందల నిలబెట్టుకొని ఉప్పు రాళ్ళు చేతుల పట్టుకొని మంత్రం చదివి ఉప్పురాళ్ళమీద ఉస్ ఉస్ అని నర్సయ్యకిస్తూ "పొద్దున, మధ్యాహ్నం, పొందుగుంకెటప్పుడు సప్పరించిపియ్యి" అన్నడు.

మలత రోజు పిల్లకు కక్కుడ కాల్వకు బందై హుషారైయింది. ఆ మాల గేరిల రాములదే మిద్దె ఇల్లు తత్మిమవన్నీ కవేలాలు, గుడిసెలే, గవర్నమెంట్ వాళ్ళు నాయనకిచ్చిన ఎకరం గైరాన్ పొలం ఉంది. అది వాగులో ఉండడం వల్ల చెరువునిండినప్పుడల్లా వరిపంట పండేది. తిండి గింజలకు తిప్పలు లేదు. బట్టలు మాయకుండా మెంటేన్ చేసే కుటుంబం. తల్లీ మాత్రం రోజు కూలికిపోవలసిందే.

సింహాయ్య దుకాణంలో రాజకీయాల గురించి మాట్లాడుతున్నడు రాములు. కొత్త కోడలైన వెంకటమ్మ దుకాణల కొచ్చి "సేట్ ఒక బట్టల సబ్బు ఇయ్యి?" అడిగింది. సబ్బు ఇచ్చాడు పైసలు తీసుకొన్నాడు. "ఏం సబ్బు సేట్ కొత్తగున్నది" అంది ఆమె. చేతిలోని సబ్బు తీసుకొని తేరిపార చూచి మల్ల ఆమె చేతిలో పెట్టేసిండు రాములు. వెంకటమ్మకు అనుమానం వచ్చింది. ఆయన నా సబ్బును ముట్టుకున్నడు మంత్రగాడు ఏమైనా మంత్రం చేసాడో ఏమో అని అనుమానం రాసాగింది. రోజులు గడుస్తున్నకొద్దీ అనుమానం పెనుభూతమైంది. ఎనిమిది రోజులైన తరువాత పూనకం వచ్చింది వెంకటమ్మకు.

"నేను ఎల్లమ్మ దేవతను మాట్లాడుతున్నరా! వెంకటమ్మకు రాములు చేతబడి చేసిండు. దాన్ని లేపుకుపోతానన్నడు. అది దాని వెనుకపోతుంది. నర్సింహా ఇల్లు కూలుతుంది."

"శాంతించు తల్లీ! శాంతించు ! ఏం కావాలి తల్లీ నీకు?"

"నాకు రాములు కావాలె, నాకు రాములు కావాలె."

రాములుగానికి నీల్గుడు ఎక్కువైంది. వాని మంత్రాలు తంత్రాలు అన్ని బైట పెట్టాలె ఆని అంతు చూడాలె. నా పెండ్లానికే చేతవడి చేస్తదా! అనుకుంటూ సర్పంచ్ ఇంటికి బయలుదేరాడు నర్సింహా.

"నర్సింహులు బావా ఏడికే తొందర తొందర పోతున్నవ్" అన్న తెలుగు పండరిని చూసాడు. "సర్పంచ్ ఇంటికి పోతున్నగా

రాములుగాడి కథ ఎందో తెలుసుకోవడానికి పోతున్న"

"అవును బావ నెలరోజుల కింద నీ చెల్లెలు కూడా రోగమూగి గా రాములుగాడి పేరే చెప్పింది. వాని పండ్లు ఊడగొడ్తెగాని ఆని మంత్రాలు తంత్రాలు ఆగవ్."

"రా మరి సర్పంచ్‌తో మాట్లాడుదాం."

"పొద్దటి నుంచి ఎడ్లు గుంజలకున్నవి నీవ్వు పా !

నేనస్తా !"

పెద్ద ఇల్లు. పెద్ద వాకిలి. వాకిట్లనే నిలబడ్డాడు టీవిగా సర్పంచ్ గురురాజారావ్.

"పంతులు! గా రాములుగాడి చేష్టలు మితిమీరిపోతున్నవి. వాడు నా పెండ్లానికి చేతవడి చేసిండు. అది వాని వెంటపోతాదంట. వాడు నా పెండ్లాన్ని ఎత్తుకపోతే నేను గాజులు తొడుక్కునెలెక్క చూచుకుంట ఉండాల్నా వాన్ని చంపుతా!".



"నర్సింహా అంత తొందర పడకూ రా లోపలికి ! చెపుతా"

వసారా లోని కట్టె కుర్చిలో గురురాజారావు కూర్చున్నాడు. కింద వెూకాళ్ళ మీద కూర్చున్నడు నర్సింహా.

"నర్సింహా దేనికైనా ఆలోచించి పని చేయాలె అట్లా తొందర పడ్డదు. నిజంగా గా రాములుగాడి చేష్టలు ఎక్కువైనవి. రెండు నెల్ల క్రింద జంగయ్య పెండ్లానికి, నెలకింద పందరిగాని పెండ్లానికి చేతబడి చేసిండు అని చెప్పిండ్రు. నాకు కూడా వాణి అరాచకాలను అణచాలని ఉన్నది. కాని ఏమి చేయలేకపోతున్న"

"పంతులు నివ్వ్ వాన్ని పిలచి వార్నింగ్ ఇయ్యాలే."

"సరే లేరా ! పిలచి మాట్లాడుతా నువు పో"

నర్సింహా వెళ్ళి పోయిందు కుర్చిలో కూర్చున్న సర్పంచ్‌కు పనిపిల్ల తెలుగు పందరి బిడ్డ చాయ తెచ్చి ఇచ్చింది. చాయ తాగుకుంట గీ రాములుగాడు ఏమనుకొంటున్నాడో ఏమో నన్నసలే కేర్ చేయడ్, ఏం పంతులు అనడు. ఏమి సలహ అడుగడు. వీన్కి నీల్గుడెక్కువుంది. వాడు వాడి బట్టల చూస్తే ఎవరైన మాలోడు అనుకొంటరా ! ఏ కర్ణమాయనో, పెద్ద కులపాయనో అనుకొంటరు. వాడు అట్ల ఉండడానికి వీలు లేదు. మాలోడు మాలోని లెక్కనే ఉండాలె, కాపోడు కాపోని లెక్కనే ఉండాలే మనమిట్లే వదిలేస్తే మాల మాదిగోల్లందరు తెల్లని బట్టలేసుకొని దొరలాగ తిరుగుతుంటే మన ఖదర్ ఏముంటది, మన ఇజ్జత్ ఏముంటది. వీణ్ణి తుంచేసేయాలి. అదేం పెద్ద కష్టమా ! వాళ్ళ వాళ్ళకు కొట్లాట పెట్టి కతం చేస్తే అయిపాయె మా తాతల నుంచి ఎన్ని చూడలే.

ఎనిమిది రోజుల తరువాత వెంకటమ్మ మళ్లా రోగమూగడం ప్రారంభించింది. ''నేను ఎల్లమ్మను మాట్లాడుతున్నరా! వెంకటమ్మకు రాములు చేతవడి చేసిండు. దాని లేపుకుపోతనన్నడు. అది దాని వెనుక పోతుంది. నర్సింహా ఇల్లు కూలుతుంది."

"శాంతించు తల్లీ ! శాంతించు.ఏం కావాలి తల్లి నీకు?"

''నాకు రాములు కావాలె, నాకు రాములు కావాలె రాములుగాడ్ని ఖతం చేస్తేనేగాని నాకు శాంతి లేదు."

వీడి చేష్టలు ఎక్కువై పోయినవి అనుకుంటా సర్పంచి ఇంటికి పోయిందు నర్సింహా.

"నమస్తే పంతులు. గా రాములుగాడ్కి పిలచి అడుగక పోతివి. గట్ల వాడు చేస్తుంటే మీరేం చేయరా? ఊరిని ఇట్లే వదిలేస్తరా! మీరెం చేయనంటే చెప్పు ! నేను వాన్ని చంపేస్తా"

"నీ ఒక్కడివే చేస్తే భారం మొత్తం నీ మీద పడ్తది. నీ ఇల్లు ఆగమైతది. మిగతావాళ్ళు గా పందరి, జంగయ్య సాయం తీసుకో. ఊరి సమస్య. చేయి నేను నీ యెన్క ఉంట నీకు సాయం చేస్తా!"

ఊర్ల ఎవ్వడు సుస్తు అయిన అది రాములుగాడి వల్లే అయింది అనే ప్రచారం చేసారు. ఊరు, ఊరు వాన్ని అసహ్యహించుకొనేటట్లు చేసారు. కులం పెద్దకు చెప్పారు. మాల గేరిల ఒక పెద్ద వేపచెట్టు ఉంది. మైసయ్య మాలోల్ల పెద్ద మనిషి రాములును యాపచెట్టు కాడికి పిలిపించాడు పిల్లలతోని, అందరి కులపోల్లను యాపచెట్టు కాడికి రమ్మని చెప్పిండు. అందరు వచ్చిండ్రు.

"రాములు ఏందిరా ఇట్లెందుకు చేస్తున్నవ్ ?"

"నేనేం చేసిననే పెద్ద నాయన?"

"గా నర్సింహా పెండ్లానికి చేతవడి చేసినవంట?"

"నాకు చేతవడి వస్తాదే. అంతా అబద్ధం. విమానం తింటున్న. దేవుని తోడు. నేనెవరికి ఏమి చేయలే! గా నర్సింహా, పందరి, జంగయ్య కలసి నా మీద కక్ష గట్టి ఇట్ల పచారం చేస్తుండ్రు."

"కాదు బిడ్డ ఊరు, ఊరు నీ మీద కోపంతో ఉంది. గీవన్ని

బంద్ చేసుకో ఏమన్న అయితే మేం ఏం చేయలేం!"

"నాకు ఏం వస్తదని ఏం బంద్ చేసుకోవల్నే గా 'నజర్' మంత్రం తప్ప."

"లంజకొడుకా అబద్దాలాడుతావురా ! నీ అంతు చూస్తా" అని అరుస్తుండు నర్సింహ. "జంగయ్య మామ మాట్లాడవేమే" "అవును, అవును ఈడు అన్ని అబద్దాలు ఆడుతుండు. వీన్ని ఊళ్ళోంచి గెంటాయాలె. నా పెండ్లాంకి ఏం చేసినవో! రోగమూగుతుంది. సుస్తు అవుతుంది."



మైసయ్య మామ ఎందుకు పిలిసిండయ్యా? అన్న భార్య రాములమ్మ మాటలకు జవాబుగా "నేను మంత్రాలు చేస్తున్ననంటా! మానాలంట గా లంగ కొడుకులు నా మీద కక్ష కట్టింండ్రు."

"అవునయ్యా ఊర్ల చాలామంది మనమీద కక్ష కట్టింండ్రు. మంచోడు కాదంటున్నారు. మంత్రగాడు అంటున్నరు. మనం ఈ ఊరు వదలి వేరొక ఊరి కన్న, పట్నం మన్న పోయి బతుకుదాం."

"ఉన్న ఊరు, కన్న తల్లి స్వర్గంతో సమానమంట. ఊరు వదిలి పోమంటవేమే ! నీకేం తెలివి లేదు ఊకో !"

"కాదయ్యా నా మాట విను ఇక్కడ పరిస్థితులు ఏం మంచిగ అనిపిస్తలేవు."

"ఆ మాట కాకుండా ఇంకేమన్న మాట్లాడు."

గల గల బైటకు పోయిండు.

రాములు తెల్లని పంచ సిల్క్ షర్ట్ వేసుకొని నుదిటి మీద గుండ్రంగా పెద్ద బొట్టు పెట్టుకొని నిగనిగ లాడుతుండు. ఊరి బస్‌స్టాండుల నిలబడి బస్సు కొరకు వేట్ చేస్తున్నడు. కావలాయన వచ్చి

"రాములు నిన్ను సర్పంచ్ పంతులు పిలుస్తుండు."

"నేను షాద్‌నగర్ పోతున్న. నాకు పనుంది రేపొస్త"

వీన్కి నీల్గుడు ఎక్కువ మనసుల అనుకొంట సర్పంచ్ దగ్గరికి పోయి విషయం చెప్పిండు.

"రెండు మూడు మాటలేనంట! ఇట్ల వచ్చి పోమన్నడు అని చెప్పు పోరా !"

కావాలాయన మళ్లా రాములు దగ్గరికొచ్చి "ఇట్లొచ్చి పామన్నడు రెండు మూడు మాటలేనంట !"

గీ పంతుల గాడు చాలా బద్‌మాస్‌గాడు అనుకొంట పంతులు ఇంటికాడికి పోతే ఆడ నర్సింహులు, జంగయ్య, మైసయ్య, పాండరి గుంపు గుంపు ఉన్నరు.

"ఏం రాములు ఊరును గబ్బు లేపుతున్నవేందిరా? ఊరు ఇజ్జత్ తీస్తున్నవేందిరా?"

"అమ్మతోడు పంతులు నాకేం ఎర్కలేదు. ఈ సుస్తులకు నాకు సంబంధం లేదు. నా బతుకేందో నేను బతుకుతున్న" "లంజకొడుక అబద్దం ఆడుతావురా అని గట్టిగా అరుస్తూ" రాములు గళ్ళ పట్టిండు నర్సింహ.

సర్పంచ్ చిర్రుకొస్తూ "నా ముందన కొట్లాడుతారా! బయటికి పోయి సావు పొండ్రి."

ఈ అరుపులకు సగం ఊరు ఆడ జమైంది. అందరినీ ఒక చేతవడి, మంత్రం అదే విశ్వాసం ఆవరించింది. చేతవడి ఎక్కడిదీ అదో మూఢనమ్మకం అనే ఆలోచన సర్పంచ్‌తో సహా ఏ ఒక్కరికి లేదు. ఆ మంత్రం అనే విశ్వాసం అందరిని కమ్మేసింది. ఊరు ఊరు అంత ఒక్కటైంది. రాములు ఒక్కడు ఒక్కడైయిండు. అతని మాట అతని భార్య తప్ప ఇంకెవ్వరు నమ్మని స్థితి వచ్చింది. ఊరు ఊరు అంతా కుత కుతలాడతూంది. రాములు మంత్రగాడు అంటుంది. అతని పీడ నుంచి విముక్తి పొందాలె అంటుంది.

"రాములు బావ! ఎవరెవరికి చేతబడి చేసినవో చెప్పు" "దేవుని తోడు నర్సయ్య బావ నాకు మంత్రం రాదు తంత్రం రాదు"

"వేయింండ్రిరా మాటలతో చెపుతాండ్రా రెండేస్తే చెపుతడు." కొట్టుకుంట కొట్టుకుంట ఊరు బయట ఉన్న ఒక వేపచెట్టు కాడికి కదిలింది ఊరు. ఎండకాలం మధ్యాహ్నం రెండు మూడు అవుతుంది. ఊరోళ్ళ గుండెలు ఎంత గరంగరం ఉందో ప్రకృతి కూడా అంతా బగబగ మండినట్లు ఉంది. కొత్త ఆకులతో కళ కళ లాడుతున్న వేపచెట్టు వేపపూల వాసనను వెదజల్లుతుంది.

"చెట్టుకు కట్టేసి అంటిస్తేగాని వాడు నిజం చెప్పడు" "కట్టేయండి కట్టేయండి."

"నన్ను వదలండి నేనేమి చెయ్యలేదు. విదిలించుకొంటున్నడు. దండం పెడుతా! నన్ను వదలండి."

చెట్టుకు కట్టి గొడ్డును కొట్టినట్లు కొడుతుండ్రు.

ఓర్చుకొంటున్నడు రాములు, రామ అంటలేడు కృష్ణ అంట లేడు కనీసం అమ్మా కూడా అంట లేదు.

# దాశరథి రంగాచార్య కన్నుమూత


(24.08. 1928 - 08.06.2015)

తెలంగాణ సాయుధ పోరాట యోధుడు, ప్రసిద్ధ సాహితీవేత్త దాశరథి రంగాచార్య మృతికి సాహితీస్రవంతి, సాహిత్య ప్రస్థానం తరపున ప్రగాఢ సంతాపం తెలుపుతున్నాం. నిజాంకు వ్యతిరేకంగా జరిగిన రైతాంగ సాయుధ పోరాటంలో ప్రత్యక్షంగా పాల్గొని, జైలుశిక్ష అనుభవించారు దాశరథి. నిజాం పరిపాలన కాలంలోని ప్రజల జీవన స్థితి గతులను తన నవలల్లో సజీవంగా చిత్రించారు. చిల్లర దేవుళ్ళు, మోదుగుపూలు, జనపదం వంటి ప్రసిద్ధ నవలలో తెలంగాణ సమాజపు జనజీవితం పరుచుకుని ఉంటుంది. వీరతెలంగాణ పోరాటం నుండి విద్యుత్ పోరాటం వరకూ ప్రజా ఉద్యమాలతోనూ, అభ్యుదయ ప్రగతిశీల సాహిత్య సంఘాలలోనూ క్రియాశీలంగా పనిచేశారు. సామవేదం నుండి సామ్యవాదం వరకూ బలమైన రచనలు చేశారు. తెలంగాణ మాండలికాన్ని, సామాజిక చైతన్యాన్ని సజీవంగా తన రచనల్లో చిత్రించారు. వారి రచనలు ప్రజా ఉద్యమాలకు, ప్రగతిశీల శక్తులకూ ఎల్లప్పుడూ ఉత్తేజాన్ని అందిస్తాయి. కలకాలం నిలిచే రచనలు చేసిన దాశరథి మృతి సాహిత్యరంగానికి తీరని లోటు. జూన్ 8న ఉదయం సాహితీస్రవంతి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి, ప్రధాన కార్యదర్శి వొరప్రసాద్‌లు దాశరథి భౌతిక కాయాన్ని సందర్శించి నివాళులర్పించడం జరిగింది. వారి కుటుంబసభ్యులకు సాహితీస్రవంతి, సాహిత్య ప్రస్థానం తరపున జోహార్లర్పిస్తున్నాం.

---

"వాడు చూడ ఏమన్నా ఏడుస్తుండా! కనీసం రాముడా, కృష్ణుడా అంటలేడు. వాన్కి పిక్కల తాయితలున్నయి ఏడ తగులుతాయిరా !"

"అవును మామా !"

రాముని భార్య ఎనిమిదినెళ్ళ గర్భవతి నా భర్తను చంపేటట్లు ఉండ్రని నాలుగు కిలోమీటర్ల దూరంలో ఉన్న కొత్తూర్ పోలీస్‌స్టేషన్‌కు వెళ్ళింది.



"శివయ్య ఆ మంత్రగాని పెండ్లాం ఏది?"

"పోలీస్ స్టేషన్‌కు పోయింది పంతులు"

"పోరా ! ఇడిసి పెట్టిండ్రు అని చెప్పి తోలుక రా పో" కావలాయన అక్కడ పోయిండు.

ఇక్కడ ఊర్ల "వాన్కి పిక్కల తాయితలున్నయి, వానికి దెబ్బలు తగులై. కాల్చుండ్రి కొడుకును. ఈ ఊరికి పట్టిన శని వదులుతది" అని ఒక పెద్ద మనిషి అరుస్తుండు. "అవునవును" అనుకుంట క్షణాల్లో ఒకడు ఎండు కట్టెలు తెచ్చిండు ఒకడు ఎండుగడ్డి తెచ్చిండు. ఒకడు గ్యాస్ నూనె డబ్బనే తీసుకొచ్చిండు. అంతా ఉన్మాదంతో ఉన్నారు.

రాములు "వద్దు వద్దు నన్ను చంపొద్దు" అని చేతిలెత్తి దండం పెడుతుండు. వాని దండాలను మొక్కులను ఎవరు పట్టించుకొంటలేరు గ్యాస్ నూనె, వానిమీద కట్టెల మీద పోసి అంటించిండ్రు.

కట్టెలు మండుతున్నయి. కాని అతనికి ఏమి కాలే. అంటే ఇంకా మంటలు దగ్గరకు రాలే. కాని ప్రజలకు అదో వింతగా "అతడు అంటుకోలే చూడు వాని మంత్రం" అని ఆశ్చర్యపోతున్నారు. "రక్షించుండ్రి, రక్షించుండ్రి" అని రాములు అరుస్తుండు. కాని ఎవరు పట్టించుకొంటలేరు. నర్సింహాకు వీడు బతకెటట్లు ఉండని అనుమానం వచ్చి ఒక పెద్ద కట్టెతో రాములు నెత్తిమీద కొట్టిండు. రాములు మంటలో పడ్డడు. మంటలు అంటుకొన్నాయి. ఇంకా కొన్ని కట్టెలు తెచ్చి అతని మీద వేస్తుండ్రు. అతని ప్రాణాలు అనంత వాయువులో కలిసాయి. అతడు సజీవ దహనం అయ్యాడు. అతని పార్థివ దేహం కాలుతుంది. చివరకు అతని శరీరం కాలి కట్టెపోయింది. ఊరి ప్రజ వికృత ఆనందం పొందింది.

పోలీస్ స్టేషన్‌కు పోయి మార్గమధ్యంల నుంచి తిరిగి వచ్చిన రాములు భార్యకు రాములు కాలి శవమై కాల్చిన మొద్దులాగ అయి కనిపించిండు. శవం మీద పడి ఎదలు కొట్టుకుంటూ ఏడ్చింది. శోకాలు పెట్టింది, శాపాలు పెట్టింది. కన్నీరు ప్రవాహం అయింది. తేరుకొని మళ్లీ పోలీస్ స్టేషన్‌కు కిందమీద పడుతూ పోయి ఫిర్యాదు చేసింది. పోలీస్‌లొచ్చారు. మాల మాదిగోళ్ళను తీసుకుపోయారు.



# శ్రీపతి కథలు - ఒక పరిశీలన

- అంపశయ్య నవీన్
9989291299

శ్రీపతి సృష్టించిన పాత్రలన్నీ సాత్వికులుగానే కనిపిస్తాయి. దుష్టులు, దుర్మార్గులు ఆయన కథల్లో కనిపించనే కనిపించరు. స్వచ్ఛమైన మానవత్వపు విలువల్నే శ్రీపతి చిత్రించాడు. ఆయన పాత్రలు ఎక్కువగా మధ్యతరగతికి చెందినవాళ్ళే. కొందరు పేదవాళ్ళు కూడా ఆయన కథల్లో కనిపిస్తారు.

శ్రీపతి రచించిన కథలు శ్రీపతిలాగే చాలా మృదువుగా, మార్దవంగా ఉంటాయి. వాటిని చదువుతోంటే మనం ఒక ప్రశాంతమైన మానసిక స్థితిలోకి వెళ్ళిపోతాం. ఎంతో అద్భుతంగా రాశాడని పాఠకులు ఎక్సైట్ అయ్యేలా శ్రీపతి కథలుండవు. అవి మన కళ్ళకు మిరుమిట్లు గొల్పేలా ఉండవు. వాటి నడక చాలా నెమ్మదిగా ఉంటుంది. ఒక దిశలో కాకుండా అనేక దిశల్లో ఆయన కథలు నడుస్తాయి.

శ్రీపతి కథల్లో పాత్రలకంటే రచయితే ముందుంటాడు. దానికి కారణమేమిటంటే శ్రీపతి కథను పాత్రలు మాట్లాడుకునే మాటల ద్వారా నడిపించడు. అందువల్లనే నాటకీయ శిల్పం శ్రీపతి కథల్లో తక్కువగా ఉంటుంది. రచయితే కథంతా చెబుతున్నట్టుంటుంది. కథలో రచయిత సర్వజ్ఞత్వమే కనిపిస్తుంది. అసలు కథలోకి రచయిత మెల్లగా ప్రవేశిస్తాడు. ప్రకృతి సౌందర్యాన్ని వర్ణించే వర్ణనలు శ్రీపతి కథల్లో పాఠకులకు ఆహ్లాదాన్ని కల్గిస్తాయి. ఆయన రాసిన కొన్ని కథలు ట్రావెలోగ్స్‌లా... అంటే ప్రయాణం చేస్తున్నప్పుడు రచయితకు ఎదురైన అనేక సన్నివేశాల్ని చెబుతున్నట్టుగా సాగుతాయి.

శ్రీపతి రాసిన చాలా కథలు అసంపూర్ణంగానే ముగిసినట్టుగా అనిపిస్తుంది. ముగింపును పాఠకుడి ఊహకే వదిలేస్తాడాయన.

ఉత్తరాంధ్ర, ఢిల్లీ, హైదరాబాద్ -ఇవి శ్రీపతి కథలకు కథాకేంద్రాలు. ఉద్యోగరీత్యా శ్రీపతి కొంతకాలం ఢిల్లీలో ఉన్నాడు. ఢిల్లీలో ఉన్నప్పుడే ఆయన ఉత్తర భారతదేశంలోని కొన్ని నగరాలకు వెళ్లాడు. అందువల్ల డిల్లీతోబాటు ఆ నగరానికి చుట్టుపక్కల ఉన్న బెనారస్ లాంటి ప్రాంతాలు కూడా శ్రీపతి కథల్లో కథాకేంద్రాలయ్యాయి.

శ్రీపతి సృష్టించిన పాత్రలన్నీ సాత్వికులుగానే కనిపిస్తాయి. దుష్టులు, దుర్మార్గులు ఆయన కథల్లో కనిపించనే కనిపించరు. స్వచ్ఛమైన మానవత్వపు విలువల్నే శ్రీపతి చిత్రించాడు. ఆయన పాత్రలు ఎక్కువగా మధ్యతరగతికి చెందినవాళ్ళే. కొందరు పేదవాళ్ళు కూడా ఆయన కథల్లో కనిపిస్తారు.

శ్రీపతి రచించిన కథలు ప్రప్రథంగా 1968లో "మంచుపల్లకి-మరితొమ్మిది" అన్న పేరుతో వెలువడిన కథా సంకలనం ద్వారా పాఠకుల ముందుకొచ్చాయి. ఈ సంకలనాన్ని ఆరోజుల్లో ఎమ్మెస్కో వారు ప్రచురించిన ఎన్నో పాకెట్స్ బుక్స్‌లో ఒకటిగా వెలువరించారు. చాలా తక్కువ ధరలకు పాఠకులకు పుస్తకాల్ని అందించాలన్న లక్ష్యంతో ఎమ్మెస్కో వారు ఎందరో రచయితల పుస్తకాల్ని పాకెట్ బుక్స్‌గా ముద్రించి రెండు రూపాయలకే వాటిని అందించారు. లబ్ధప్రతిష్ఠుల పుస్తకాల్నే కాకుండా ఎందరో ఆనాటి శ్రీపతి లాంటి వర్ధమాన రచయితల పుస్తకాల్ని కూడా ఎమ్మెస్కో వారు ప్రచురించి ప్రోత్సహించారు.

"మంచుపల్లకి-మరితొమ్మిది" పుస్తకం రెండో ముద్రణగా 2005లో వెలువడింది. దీంతో పాటుగా శ్రీపతి మరో మూడు

కథా సంకలనాల్ని కూడా వెలువరించాడు. "మంచుపల్లకి-మరితొమ్మిది"లో చోటు చేసుకున్న కథల తర్వాత శ్రీపతి రచించిన కథలన్నిటిని ఈ 3 సంకలనాల్లో శ్రీపతి చేర్చారు. ఆ మూడు సంకలనాలు: "ఎల్లోరాలో వాళ్లు ముగ్గురు", "బెనారస్ చిత్రాలు", "సత్యజిత్‌రాయ్ ఎవరు" ('సత్యజిత్‌రే' అని ఉండాలి) ఈ మూడు సంకలనాల్లోని నాకు నచ్చిన కొన్ని కథల్ని పరిశీలించటమే ఈ వ్యాసోద్దేశం.

"మంచుపల్లకి" కథ బుల్లబ్బాయి అన్న ఒక బాలుడి దృక్కోణం లోంచి చెప్పబడింది. 'మంచుపల్లకి' మృత్యువుకు సంకేతం. ఈ కథలో బుల్లబ్బాయి తల్లి చనిపోతుంది. కానీ కథ చివరివరకు తన తల్లి చనిపోయిందన్న నిజం బుల్లబ్బాయికి తెలీదు. బుల్లబ్బాయికి పదకొండేళ్ళు. ఒక పాఠశాలలో చదువుకుంటుంటాడు. అతని తల్లికి జబ్బు చేస్తే హాస్పిటల్లో చేర్పించారు. బుల్లబ్బాయికి రోజూ తండ్రికి టిఫిన్ బాక్సులు బస్సుడ్రైవర్ ద్వారా పంపించే పని పడ్తుంది. అందరూ బుల్లబ్బాయికి మీ అమ్మ హాస్పిటల్లో కోలుకుంటున్నదనే చెబుతుంటారు. తల్లి శవాన్ని చూసేంత వరకు బుల్లబ్బాయికి వాళ్ళమ్మ చనిపోయిందన్న విషయం తెలియనే తెలియదు. ఎవరూ తనకు ముందే ఈ విషయం చెప్పకపోయి నందుకు, సజీవంగా ఉన్నప్పుడే తన తల్లిని కలుసుకోలేక పోయినందుకు బుల్లబ్బాయి ఎంత బాధపడ్డాడో ఈ కథ చివర్లో రచయిత ఇలా చెప్పాడు:

*"గొర్రెలకాపరి గొడుగు" అన్న కథలో గొర్రెలకాపరి నర్తోడు తిరగబడటం ప్రధాన సన్నివేశం. చెయ్యని దొంగతనానికి తన్నులు తినడంతో నర్తోడు తనను నిష్కారణంగా శిక్షిస్తున్న బడాబాబు మీద తిరగబడ్తాడు. గొర్రెల కాపరిని తిరగబడటానికి సింబల్‌గా చిత్రించాడు ఈ కథలో శ్రీపతి.*

"అక్క గుండెపగిలే ఏడుపు నిజం. చెప్పినప్పుడు (తల్లి చనిపోయిందని) బావంటే కోపం వచ్చింది. డాక్టర్లంటే కోపం వచ్చింది. నాన్నంటే కోపం వచ్చింది. స్లిప్ టెస్టులంటే కోపం వచ్చింది. టీచర్లంటే కోపం వచ్చింది. చదువంటే కోపం వచ్చింది. తనమీద తనకే, తన నిస్సహాయత మీద తనకే కోపం వచ్చింది. ఆ కోపంతో, ఆ బాధతో, ఆ హింసతో, అక్కడ గుమికూడిన జనాన్ని చూసి బావురుమని ఏడ్చాడు బుల్లబ్బాయి"

అక్క ఏడుపు వినేంతవరకు బుల్లబ్బాయికి తన తల్లి చనిపోయిందన్న విషయం తెలియకపోవడం-ఈ కథలో ముఖ్య సంఘటన. ఈ కథలో బుల్లబ్బాయి తల్లి చనిపోయిందని రచయిత కూడా ఎక్కడా చెప్పడు. అక్క యేడుపు విన్నప్పుడే ఆ కుర్రాడికి తల్లి పోయిందన్న విషయం తెలిసిందని చెప్పడమే ఈ కథలోని కొస మెరుపు. కథ ముగించేటప్పటికి పాఠకులకు కన్నీళ్ళొస్తాయి. డ్రైవర్ ద్వారా కారియర్ పంపించే డ్యూటీ ఉండటం వల్లనే బుల్లబ్బాయి తల్లిని చూడటానికి హాస్పిటల్‌కు వెళ్ళలేకపోతాడు. "మంచుపల్లకి" కథే కాకుండా ఈ సంపుటిలోని మిగతా తొమ్మిది కథలు కూడా బావుంటాయి.

శ్రీపతి వెలువరించిన రెండో కథాసంపుటి "సత్యజిత్‌రే ఎవరు?" ఈ సంపుటిలో కూడా పది కథలున్నాయి. ప్రఖ్యాత సినీదర్శకుడు సత్యజిత్‌రే దర్శకత్వం వహించిన సినిమాలను చూసే కొందరు మిత్రుల కథే ఈ కథ. విప్లవోద్యమం పేరుతో కొందరు చందాలు వసూలు చెయ్యడం, వాటిని స్వంత ఖర్చులకు వినియోగించటం- ఈ విషయాన్ని ఎవరైనా ఆ విప్లవోద్యమంలో పనిచేస్తున్న ఇతరులు కొందరు ఎత్తిచూపితే అతన్నో విప్లవ ద్రోహిగా చూడటం- విప్లవోద్యమంలోని ఈ నైతిక సమస్యను బహిర్గతం చేసిన కథే ఈ "సత్యజిత్‌రే ఎవరు?". ఈ కథలో ప్రధాన పాత్రలు ముగ్గురు: భాస్కర్, సూర్యం, రాము. వీళ్ళు ముగ్గురు విప్లవోద్యమంలో పని చేస్తుంటారు. రాము ఈ కథను 'నేను' అంటూ ఉత్తమ పురుషలో చెబుతాడు. సూర్యం అనేవాడిది చాలా ఆకర్షణీయమైన రూపం. అతనికి చందాలు వసూలు చెయ్యడంలో మంచి నేర్పుంది. సూర్యం బాగా తిరుగుతుంటాడు. సత్యజిత్‌రే సినిమాలు చూసి ఆయనను కలుసుకోవాలని కలకత్తా వెళ్తాడు. చలం పుస్తకాలు చదివి చలాన్ని కలుసుకోవాలని తిరువణ్ణామలై వెళ్తాడు. శ్రీశ్రీని కలుసుకోవాలని మద్రాసు వెళ్తాడు. ఈ ఖర్చులకోసం అప్పులు చేస్తాడు. అప్పులు తీర్చటానికి సంస్థ డబ్బు వాడుకుంటాడు. రాము దీన్ని బయటపెట్టినప్పుడు సూర్యం యేడుస్తాడు. రామూను విప్లవ ద్రోహిగా చిత్రిస్తాడు. విప్లవోద్యమ సంస్థల్లో పనిచేసేవాళ్లను ఎంతో గొప్పవాళ్ళు, త్యాగశీలురు అనుకుంటాం. వాళ్లు కూడా "మేం విప్లవోద్యమంలో పనిచేస్తున్నాం కాబట్టి ఇతరులకంటె గొప్పవాళ్లం" అనుకుంటారు. అలాంటి వాళ్ల బండారాన్ని బయటపెట్టటంలో శ్రీపతి ఈ కథ ద్వారా సఫలీకృతుడయ్యాడు.

"గొర్రెలకాపరి గొడుగు" అన్న కథలో గొర్రెలకాపరి నర్తోడు తిరగబడటం ప్రధాన సన్నివేశం. చెయ్యని దొంగతనానికి తన్నులు తినడంతో నర్తోడు తనను నిష్కారణంగా శిక్షిస్తున్న బడాబాబు మీద తిరగబడ్తాడు. గొర్రెల కాపరిని తిరగబడటానికి సింబల్‌గా చిత్రించాడు ఈ కథలో శ్రీపతి. మునిపల్లెరాజు అన్నట్టు "ఈకథలో 'గొర్రెలకాపరి' గొప్ప సింబాలిక్ ఫిగర్. తాటాకుల గొడుగు పలాయనవాదపు ప్రతిబింబం. దాన్ని తుప్పమీద విసిరేశాడు అనడం- గొర్రెలకాపరి తనలోని పలాయనతత్వాన్ని వదిలేశాడని చెప్పడం- ఇలా కొన్ని సంఘటనల్ని ప్రతీకాత్మకంగా చిత్రించటం శ్రీపతి కథల్లో చూస్తుంటాం.

"మా ఊరు సముద్రం" అన్న కథ - ఇది డిల్లీలో జరిగే

కథ. డిల్లీ నగర వాతావరణం ఈ కథలో చాలా చక్కగా చిత్రించబడింది. మంచి అభిరుచి ఉన్న శాలినికి పిల్లల్లేరు. ఈ కారణం వల్ల భర్త వేరే ఆమెను పెళ్లి చేసుకున్నాడు. ఈ కథ చెబుతున్న రావుకు శాలినికి ఉన్న సంబంధం కేవలం స్నేహం మాత్రమే. రావుకు తన స్వంత ఊరు విశాఖపట్నం వెళ్ళాలని ఉంటుంది. అతనికి సముద్రం అంటే ఇష్టం. శాలినికి కూడా సముద్రమంటే చాలా ఇష్టం. ఆరాధన. వెళ్లేముందు శాలినిని కల్సి వెళ్లాలని వాళ్ళింటికి వెళ్తాడు. ఈ కథంతా శాలిని ఇంట్లోనే జరుగుతుంది. శాలిని పెయింటర్. ఆమె వేసిన పెయింటింగ్స్‌ని రావుకు చూపిస్తుంది. "శాలిని పరంపరగా వేస్తున్న చిత్రాలు పువ్వులు. పువ్వులతోనే ఆమె కేన్వాసులు నిండిపోయాయి. ఆకులు, చెట్లు, ప్రకృతి సుందర దృశ్యాలు, ఆకాశంలో మేఘాలు, సంధ్యలు, రుతువులు, కాలం -అంతటినీ ఆమె పువ్వుల రూపంలో వర్ణమయం చేస్తుంది. మన అంతరంగంలో వెల్లివిరిసే రంగురంగుల పువ్వులవి. "ఆమె చిత్రాలు వర్ణ ఇంద్రజాలం" అని శ్లాఘిస్తారు కళావిమర్శకులు" ఇలా శాలిని వేసిన చిత్రాలను తనూ ఓ చిత్రకారుడై వర్ణిస్తాడు శ్రీపతి.

అయితే శాలినిలో ఒక తీవ్రమైన అసంతృప్తి ఉంది. అదే ఆమెకు పిల్లలు లేకపోవడం. రావు శాలిని ఇంట్లో ఉన్నప్పుడే ఆమె భర్త వర్మ అక్కడకొస్తాడు. శాలినికి పిల్లలేరన్న కారణంతో ఆయన మరొకామెను పెళ్ళి చేసుకున్నాడు. ఆమె పేరు ఉత్తమ్. ఆమెకు పిల్లలున్నారు. ఆ పిల్లల్లో ఒక పిల్ల పేరు మున్నీ. మున్నీ అంటే శాలినికి ఇష్టం. మున్నీని తన దగ్గరుంచి పొమ్మంటే వాళ్లు ఉంచి పోలేదు. వాళ్లను భోజనం చేసిపొండని బతిమాలినా చెయ్యకుండానే వెళ్ళిపోయారు. శాలిని బాధపడ్తుంది. యేడుస్తుంది. రావు ఆమెను ఓదార్చటానికి ప్రయత్నిస్తాడు. "మున్నీకి నీవే నిజమైన అమ్మవు... ముందు ముందు వర్మ ఉత్తమ్‌లు మున్నీని నీ దగ్గర్నే ఉంచుతారు" అంటాడు రావు. ఎక్కడో అమెరికాలోని లాస్‌ఏంజెల్స్ నగరంలో ఉన్న వాళ్ళమ్మతో మాట్లాడుతుంది. తీవ్రమైన మానసిక సమస్య-డిప్రెషన్‌కు గురయిన శాలిని చివరకు డా॥ ఉమేష్‌చంద్ర అన్న సైకియాట్రిస్టు దగ్గర ట్రీట్‌మెంట్ తీసుకుంటున్నదన్న సూచనతో శ్రీపతి ఈ కథను ముగించాడు. శ్రీపతి కథల్లో మనల్ని తీవ్రంగా కదిలించే సంఘటలేవీ ఉండవు. ప్రశాంతంగా "బిట్వీన్ దిలైన్స్" చదవగల్గితే ఎంతో ఆలోచించేలా చేస్తాయి. నాకు బాగా నచ్చిన కథల్లో ఈ "మా ఊరు సముద్రం" ఒకటి.

"బెనారస్ చిత్రాలు" అన్న కథను శ్రీపతి తనకు నచ్చిన తన కథ అని చెప్పుకున్నాడు. ఈ కథను కూడా శ్రీపతి ఉత్తమ పురుషలోనే చెప్పాడు. ఇదొక యాత్రారచన. యాత్రా రచనను, ఇలా తప్ప మరోలా చెప్పలేమంటాడు. నేనూ అంటూ ఈ కథ చెబుతున్న వ్యక్తి (శ్రీపతే అనుకుందాం) బెనారస్ వెళ్ళటం- అక్కడ నబనీత్ అనే చిత్రకారుడితో పరిచయమేర్పడటం - పరిచయం స్నేహంగా మాటరం - నబనీత్ భార్య శ్యామల కూడా అతనికి దగ్గర కావటం - నబనీత్ వాళ్ళింటికెళ్ళినప్పుడు నబనీత్ నాయనమ్మను కలవడం - ఆమెకు నూరేళ్ళు అని తెలీటం - వాళ్ళింట్లో భోజనం చేసినప్పుడు వాళ్ళు పెట్టే వంటకాల్లో స్వీట్స్ ఎక్కువగా ఉంటాయని తెలీటం - నబనీత్ - అతని భార్య శ్యామల - ఇద్దరూ చాలా స్నేహంగా ఉంటారని తెలియటం - గంగానది ఒడ్డున పడవ నడిపేవాళ్ళను చూడటం - గంగానది ఒడ్డున కూర్చొని చిత్రకళాభ్యాసం చేస్తున్న విద్యార్థిని చూడటం - ఈ దృశ్యాలన్నీ మనల్ని ఆకర్షిస్తాయి. తీరా ఈ కథ చెబుతున్న వ్యక్తి బెనారస్ విడిచి వెళ్తున్నప్పుడు అతనికి వీడ్కోలు చెప్పడానికి నబనీత్-శ్యామలలు రాకపోవడం - శ్యామల కన్నీళ్ళు కారుస్తున్నట్టుగా ఊహించుకోవడం- "శ్యామల కళ్ళనించి అశ్రువులు రాలుతున్నాయి. గంగామాయి శ్యామలకు బెనారస్‌లో బహూకరించింది చివరకు ఈ అశ్రువులేనా?" అంటూ శ్రీపతి ఈ కథను ముగిస్తాడు. "నబనీత్ బమ్మల్నే చూడకపోతే, ఈ కళాజగత్తు నా కళ్ళకందేనా?" అన్నది ఈ కథలోని చివరి వాక్యం. పెయింటింగ్స్‌ను గూర్చి శ్రీపతికున్న అవగాహన ఈ కథలో చక్కగా ద్యోతకమయింది.

ఇదొక అందమైన ట్రావెలోగ్ - యాత్రారచన. ట్రావెలోగ్స్‌ని రాయటంలో శ్రీపతి ప్రతిభ ఎంత గొప్పదో ఈ కథ తెలియజేస్తుంది.

"నెమళ్ళ అడవి" అన్న కథను కూడా రచయిత నేనూ అంటూ ఉత్తమపురుషలో చెప్పాడు. అడవిలో సవరజాతివాళ్ళుండే పల్లెటూళ్లో ఒక స్కూలు టీచర్, సంజీవ్ ఉంటాడు. సంజీవే ఈ కథ చెబుతాడు. ఈ కథలోని మరో పాత్ర సత్యం- సత్యం గాయకుడు కావాలనుకుంటాడు. సత్యం ఒక రైతుకూలి. భార్యతో విడాకులు తీసుకోవాలనుకుంటాడు ఆమెకు అక్రమ సంబంధం ఉందన్న అనుమానంతో. ఊరిపెద్దల ద్వారా విడాకుల తంతు పూర్తవుతుంది. సత్యంతో వెళ్ళి నెమళ్ళ అడవి చూడాలనుకుంటాడు సంజీవ్. ముద్దుకృష్ణ అనే అతడు సంజీవ్ స్నేహితుడు. నెమళ్ళ అడవికి వెళ్తారు. పెద్ద వర్షం వచ్చి ఆటంకం కల్గిస్తుంది. అడవిలో వర్షంలో ప్రయాణం చెయ్యడం చాలా థ్రిల్లింగ్‌గా ఉంటుంది. ఆ వర్షంలో నెమళ్ళ జంటను చూడటం మరో అద్భుతమైన అనుభవం.

*సత్యంతో వెళ్ళి నెమళ్ళ అడవి చూడాలనుకుంటాడు సంజీవ్. ముద్దుకృష్ణ అనే అతడు సంజీవ్ స్నేహితుడు. నెమళ్ళ అడవికి వెళ్తారు. పెద్ద వర్షం వచ్చి ఆటంకం కల్గిస్తుంది. అడవిలో వర్షంలో ప్రయాణం చెయ్యడం చాలా థ్రిల్లింగ్‌గా ఉంటుంది. ఆ వర్షంలో నెమళ్ళ జంటను చూడటం మరో అద్భుతమైన అనుభవం.*

సత్యం భార్య ముత్యాలు సామూహిక అత్యాచారానికి గురి కావటం– తీవ్రమైన షాక్‌కు గురయిన ఆమె భర్త సత్యం దగ్గరకు వెళ్ళటానికి అంగీకరించకపోవడం – ఆ ఊర్లోని సావిత్రమ్మ, శాస్త్రి చేసిన ప్రయత్నాల వల్ల ముత్యాలు తన భర్త దగ్గరకు వెళ్ళటానికి అంగీకరించటం – ఈ కథలో అడివి జనం పాడుకునే పాటలు – వాటిని టేప్‌రికార్డర్‌లో రికార్డు చెయ్యటం – సత్యాన్ని ముద్దుకృష్ణ డిల్లీకి తీసికెళ్ళి గొప్ప గాయకుణ్ణి చేస్తాననడం – ఈ విషయం తెలిసినపుడు సంజీవ్ బాధపడటం – తనతోబాటు నెమళ్ళ అడవినీ, ఆ పరిసరాలనూ తీసికెళ్తున్నాడని ఫీలవడం – కానీ దేశానికొక గొప్ప గాయకుడ్ని ఇస్తున్నానని సంతోషించటం. ఈ దృశ్యాలన్నీ పాఠకున్ని ప్రకృతి అందాలకు నిలయమైన అడవి మధ్యలోకి తీసికెళ్ళి గొప్ప పారవశ్యాన్ని కల్గిస్తాయి.

"చెట్లు కూలుతున్న దృశ్యం" అన్న శ్రీపతి రచించిన మరో కథలో ముఖ్యమైన పాత్రలు మూడు – ఒకరు: డా॥ సత్యం–యువకుడు. రెండోవ్యక్తి: దీక్షితులు–జర్నలిస్టు. డిల్లీలో ఉంటున్న వీఐపీల్లో ఒకడు. మూడో వ్యక్తి: అవతారం–ఒకప్పుడు దీక్షితులుకు స్నేహితుడు. వీళ్ళు చాలాకాలం తర్వాత కలుసుకుంటారు. వెనకటి జ్ఞాపకాలను నెమరు వేసుకుంటారు. ఫలానా మిత్రుడి భార్య చనిపోయిందని చెప్పుకొని నవ్వుకుంటారు. తర్వాత అవతారం భార్య కూడా చనిపోయిందని చెప్పుకొని నవ్వుకుంటారు.

> ***"కథలు రాస్తాను" అనే కథ శ్రీపతి గారి ఆత్మకథేమో అన్నట్టుగా సాగుతుంది. ఒకప్పుడు కథలు రాసి ఇప్పుడు రాయడం మానేసిన ఒక మాజీ రచయితకు, ఇప్పుడు కథలు రాస్తున్న వర్ధమాన రచయితకు మధ్య యేర్పడిన సంబంధాన్ని ఈ కథ చిత్రిస్తుంది.***

డా॥ సత్యం ఆ రాత్రి ఓ మూడేళ్ళ కుర్రాడు చనిపోయాడని చెప్పినప్పుడు కూడా వాళ్ళిద్దరు– దీక్షితులు, అవతారం – నవ్వుతారు. డా॥ సత్యానికి వాళ్ళ నవ్వులు చాలా అసందర్భంగా కనిపిస్తాయి. కథ చివర్లో దీక్షితులు ఇంట్లో వంటమనిషిగా పనిచేస్తున్న సీత–సామూహిక అత్యాచారానికి గురై చనిపోయిందన్న వార్త తెలిసినప్పుడు మాత్రం దీక్షితులుకు ఆ నిమిషాన మనసు మొద్దుబారిపోతుంది. ప్రతివాడి చావు గురించి తెలిసినప్పుడు నవ్వుకున్నవాళ్ళు ఈసారి మొద్దుబారిపోయారు. "ఇంతసేపూ నవ్వుతూ మాట్లాడుకుని, సాయంత్రం సీత చేసిపెట్టిన రొట్టెలు తిని, అవతారానికి నిద్ర ముంచుకు రావడం చూసి పడుకోమని చెప్పి తను వచ్చి చదువుకుంటుండగా ఈ భయంకరమైన వార్త – దీక్షితులుకు ఇప్పుడు నవ్వురాలేదు. దీక్షితులుకి ఆ నిమిషాన మనసు మొద్దుబారిపోయింది. అవతారాన్ని నిద్రలేపి ఆ చలిలో కారు బైటికి తీసి సత్యం పనిచేస్తున్న ఆలిండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్‌కి దారితీశాడు.

పొగమంచు. కన్నీళ్ళు... ఆందోళనతో కొట్టుకుంటున్న గుండె. తన కలం మీదకు శత్రువుల దాడి. తన కలంలో అంతర్వాహినిగా ప్రవహిస్తున్న గంగానది మీద శత్రువు దాడి. అప్పుడు చందమామ మీద, ఇప్పుడు జాబిల్లి మీద" ఇదివరకు చావు వార్తలు (చెట్లు కూలుతున్న దృశ్యం) విన్నప్పుడల్లా నవ్వినవాళ్ళు, ఇప్పుడు సీత చనిపోయిందన్నవార్త విన్నప్పుడు ఎందుకు నవ్వలేదో రచయిత చెప్పడు. మన ఊహకే వదిలేస్తాడు.

"స్నేహితులు" అన్న కథలో కూడా డిల్లీ వాతావరణమే. మాధవి, సూరి ఓ హోటళ్ళో (బంకూరా) భోజనం చేస్తూ మాట్లాడుకుంటారు. మాధవి మొదలు శివాజీని చేసుకుంటానని తర్వాత అతన్ని వదిలేసి భట్టాచార్యతో తిరగటం మొదలెట్టింది. సూరి మాధవిని శివాజీని ఎందుకు వదిలేశావని అడిగితే "శివాజీ ఒక తెలివైన అవకాశవాది'' అంటుంది. భట్టాచార్యతో తిరుగుతున్నానే గానీ అతనితో పెళ్ళి విషయం మాట్లాడలేదంటుంది. ఇద్దరం కేవలం స్నేహితులం మాత్రమేనంటుంది. తర్వాత సూరికి స్నేహలత అనే ఆమె చెబుతుంది: ఈ భట్టాచార్య అనేవాడో పిచ్చివాడని. గాంధీయిజమే ప్రపంచ సమస్యలన్నింటికి పరిష్కారమని భట్టాచార్య నమ్ముతాడంటుంది. పిలిచి యూనివర్శిటీలో ఉద్యోగం ఇస్తానంటే ఆ ఉద్యోగంలో చేరలేదట. మాధవి కూడా అతనితో తిరుగుతూ పిచ్చిదైపోయిందని, ఆదివాసీ గ్రామ ప్రాంతాల్లో పిల్లలకు చదువు చెప్పి బతుకుదామని వాళ్ళిద్దరు నిర్ణయించుకున్నారని కూడా స్నేహలత సూరికి చెబుతుంది. ఇదంతా విని సూరి భయపడ్డాడని, భట్టాచార్యను కలవాలని అనుకున్నాడని చెబుతూ శ్రీపతి ఈ కథను ముగించాడు. ఒకరి దృష్టిలో గొప్పవాళ్ళుగా ఉన్నవాళ్లుమరొకరి దృష్టిలో పిచ్చివాళు ళ్ళగా మారిపోవటం... క్షణక్షణం మారిపోయే మానవ సంబంధాల్ని... ఈ కథలో రచయిత సృష్టించాడు.

"పుత్రాన్వేషణ" అనే కథలో తప్పిపోయిన కొడుకు కోసం వెతుకుతున్న ఓ తండ్రి వేదనను రచయిత చిత్రించాడు. ఆ తండ్రి పేరు కృష్ణమూర్తి. విపరీతమైన ఢిల్లీ చలిలో వేసవి దుస్తులు వేసుకొని ఈ కృష్ణమూర్తి తిరుగుతుంటాడు. జయచంద్ర అనే ఆల్‌ఇండియా రేడియోలో పనిచేసే అతని స్నేహితుడిని కలుసుకోవడానికి రేడియో స్టేషన్‌కొస్తాడు. అతన్ని చూడగానే అందరూ అతనికి నమస్కారం చేస్తారు. జయచంద్రను చూసి తన కొడుకు ధర్మారావు కూడా ఇలాగే ఉండేవాడనుకుంటాడు. జయచంద్ర ద్వారా తన కొడుకు ఆచూకి దొరుకుతుందే మోననుకుంటాడు. ధర్మారావు తనకు

కనిపించలేదని జయచంద్ర చెప్పడంతో కృష్ణమూర్తి, రేడియో స్టేషన్ నుండి వెళ్లిపోతాడు. రేడియో స్టేషన్‌లో న్యూస్‌రూంలో ఉండే వాతావరణాన్ని ఈ కథలో శ్రీపతి స్వానుభవం కారణంగా అత్యంత వాస్తవికంగా చిత్రించగల్గాడు.

"కథలు రాస్తాను" అనే కథ శ్రీపతి గారి ఆత్మకథేమో అన్నట్టుగా సాగుతుంది. ఒకప్పుడు కథలు రాసి ఇప్పుడు రాయడం మానేసిన ఒక మాజీ రచయితకు, ఇప్పుడు కథలు రాస్తున్న వర్ధమాన రచయితకు మధ్య యేర్పడిన సంబంధాన్ని ఈ కథ చిత్రిస్తుంది. "ఏవి తల్లి నిరుడు కురిసిన హిమసమూహములు" అని ప్రశ్నించుకుంటూ బతికే మాజీ రచయిత, సత్యమూర్తి అనే వర్ధమాన రచయితను యేం చేస్తున్నావని అడిగితే "బతకటం కోసం కథలు రాస్తాను" అంటాడు సత్యమూర్తి. ఆ సమాధానంతో మాజీ రచయితకు అతని మీద అభిమానం యేర్పడుతుంది.

సత్యమూర్తి కథ 'మహానగరం' ఓ పత్రికలో ప్రచురించబడటం – ఆ కథ మాజీ కథకుడికి నచ్చకపోవటం – కానీ ఆ కథ అప్పలస్వామి అనే రుషితుల్యుడి లాంటి వాడికి నచ్చడం మాజీ రచయితను షాక్ చేస్తుంది. మాజీ కథకుడి కూతురు తార సత్యమూర్తికి దగ్గరౌతుంటుంది. కానీ తార అతన్ని పెళ్ళి చేసుకోవటానికిష్టపడదు. పెళ్ళి కంటె ముఖ్యమైన బాధ్యతలు వేరే ఉన్నాయంటుంది తార. తన కూతురు తారను గూర్చి మాట్లాడదామని మాజీ రచయిత సత్యమూర్తి ఇంటికి వెళ్తాడు. కానీ సత్యమూర్తితో తార విషయం మాట్లాడకుండానే తిరిగొస్తాడు. ఇలా కథల్ని అర్ధాంతరంగా ముగించటం శ్రీపతి కథల్లో జరుగుతుంటుంది.

'ఒక స్వప్నం' అన్న కథలో తన అరటిగెలను ఎవరో ఎత్తుకుపోయారని అందర్నీ నానా తిట్లు తిట్టే ఓ అమ్మాయి– ఆ అమ్మాయి పేరు పద్మావతి. ఆమె అన్న సూర్యం శాంత స్వభావుడు. ఆంధ్ర ఒరిస్సా సరిహద్దు ప్రాంతం ఈ కథకు కేంద్రం. రమేష్ పండా అనే అతడొక మాఫియా గ్యాంగ్ లీడర్. పద్మావతి అతన్ని కూడా తిడ్తూనే ఉంటుంది. భాస్కరం అనే బ్యాంక్ ఉద్యోగి ఆ ఊర్లో ఉండకూడను కుంటాడు. ఎందుకంటే ఆ ఊరంతా కంపుమయం. ఓరోజు అతనికి ముదురాకుపచ్చచీర కట్టుకున్న ఓ అందమైన అమ్మాయి కనిపిస్తుంది. ఆ అమ్మాయి తన స్వప్నం అనుకుంటాడు భాస్కరం. ఆ అమ్మాయిని మరోసారి చూడటం కోసమే అతడా ఊర్లో ఉండిపోతాడు. ఆ అమ్మాయి కోసం అతడు ఆ ఊరంతా గాలిస్తుంటాడు. మధ్యలో ఊర్లో కొన్ని తగవులు. చివరకు భాస్కరానికి ఊరి దేవాలయంలో దేవుడికి అరటిగెల సమర్పిస్తూ– ఆ అమ్మాయి ముదురాకుపచ్చ చీరె కట్టుకున్న అమ్మాయి –కనిపిస్తుంది. ఆమె ఎవరో కాదు, అందర్నీ తిట్టే తిట్లమారి పద్మావతే!

"ఎల్లోరాలో వాళ్లు ముగ్గురు" అన్న కథలో ముగ్గురు స్నేహితులు రాజు, పాల్, శంకరం సరదాగా వెనుక జన్మలో వాళ్ళెవరో గుర్తు చేసుకుంటారు. "నేనా కాలంలో నర్తకిని" అంటాడు పాల్. "నేను బౌద్ధభిక్షువును" అంటాడు శంకరం. "నేను శిల్పిని" అంటాడు రాజు. ఎల్లోరా పరిసరాలు... ఈ ముగ్గురు స్నేహితుల మధ్య జరిగే సంభాషణలు – ఈ కథలో ముఖ్యమైన ఆకర్షణలు.

ఇటీవలనే 'శ్రీపతి' తన ఐదవ కథల సంపుటిని ప్రచురించాడు. "కాటుక కళ్ళు–కథలు మూడు" పేరుతో. ఈ సంపుటిలో శ్రీపతి రచించిన 14 కథలు చోటు చేసుకున్నాయి. ఈ సంపుటిలోని ఒక కథను గురించి చెప్పి ఈ వ్యాసాన్ని ముగిస్తాను.

"దేవుడి సొమ్ము" అనే కథను శ్రీపతి ఇదివరకు "కాటేసిన సిరి" పేరుతో ఆంధ్రప్రభ వారపత్రికలో ప్రచురించాడట. ఇప్పుడు ఆ కథ పేరును "దేవుడి సొమ్ము" గా మార్చి, కథలో కూడా చిన్న మార్పులు చేసి ఈ సంపుటిలో చేర్చాడు.

ఈ కథలోని కథా నాయకుడు సత్యం నిరుద్యోగి. వంశధార వరదల్లో వాళ్ళ అక్క పద్మ మరణించింది. ఆ విషాదానికి తట్టుకోలేని అతని తల్లి ఎప్పుడూ యేడుస్తూనే ఉంటుంది. సత్యం ఒకరోజు ఆ నది ఒడ్డున కూర్చొని ఆలోచిస్తూ, నదిలో స్నానం చెయ్యడానికి దిగుతాడు. ఆ నదిలో ఒక స్త్రీ శవం కొట్టుకొని వస్తుంది. ఆ శవాన్ని నది ఒడ్డుకు తీసుకొచ్చి చూస్తే ఆ శవం వంటినిండా బంగారు నగలుంటాయి. ఆ నగల్ని వొల్చుకొని ఆ శవాన్ని మళ్లీ నదిలోకి తోసేస్తాడు.ఆ బంగారు నగల్ని తన స్వంతం చేసుకుంటే ఆ కుటుంబపు ఆర్థిక సమస్యలన్నీ తీరుతాయి. కానీ అతనిలో గొప్ప సంఘర్షణ – ఆ నగల్ని తన స్వంతం చేసుకోవడం నేరమని, అనైతికమని అతని అంతరాత్మ ఘోషిస్తుంటుంది. చివరికతడు ఆ నగల్ని ఆ ఊరి దేవాలయం హుండీలో వేసెయ్యాలని నిర్ణయించుకుంటాడు. అబ్బూరి ఛాయాదేవి ఈ సంపుటికి రాసిన ముందుమాటలో అన్నట్టు "ఇది గొప్ప కథ" శీర్షిక మార్పుతో ముగింపులోని ఆంతర్యం మరింత ప్రస్ఫుటమైంది"

ఈ సంపుటిలోని "చేపకత... చీమకత", ""డాలర్ కథ" అన్న కథలు ప్రతీకాత్మకంగా సాగుతాయి.

అబ్బూరి ఛాయాదేవి గారన్నట్టు శ్రీపతిగారిలో ఒక రచయిత, ఒక కవి, ఒక చిత్రకారుడు, ముగ్గురి హృదయాలతో కూడిన మూర్తిమత్వం ద్యోతకమవుతుంది. శ్రీపతి తన మిత్రులతో చేసే సంభాషణల్లోనూ, రాసే కథల్లోనూ కూడా ఆ మూడు రకాల ప్రతిభలూ ప్రదర్శితమవుతాయి. మనుష్యుల హావభావాలనైనా, ప్రకృతి దృశ్యాలనైనా, సంసార సాగరంలో ఈదుతున్నప్పటి అనుభవాలనైనా, యాత్రానుభవాలనైనా, వరదల్లో భీభత్సానుభవాలనైనా కళ్ళకు కట్టినట్టు అక్షరాల్లో చిత్రించే నేర్పు శ్రీపతిగారికుంది.

## ప్రేమ ఊట

- తంగెళ్ళపల్లి కనకాచారి
8790874028



అమ్మ పొట్ట ఉంది
తనలో నేను ఓ అద్భుతసృష్టి..!
నవమాసాలు ఉన్న గది నుంచి
భళ్ళున నేలపై ఉదయించాను!
బోలెడు వెలుతురు...
తొలి ఏడుపు... ఓ హర్షం... వేడుక !!!

చీకటి గూడు.. ప్రేమ ఊయలైంది
ఆత్మీయతే తోడైంది
కనురెప్ప రక్షణైంది... నడకైంది...
తీయని పలుకై... బుడిబుడి అడుగులై
మాటల వరదై... బడిదాకా నడిచింది !!

ఇప్పుడు నాదే ఓ లోకం
అమ్మా... నాన్న.....
తమ్ముడు... అన్న... అక్క...
ఇల్లు...
బడి...
దోస్తులు...!!!

విరిసీవిరియని పూలే...
గుభాళించే పరిమళం...
భ్రమలు.. నిజాల దోబూచులాట...
యవ్వనం.. రంగుల లోకం...!

నీకు నువ్వే లోకం....
అదిగో... నీ ప్రతిధ్వనే తోడుగా జతైంది!
అచ్చం... అమ్మా నాన్న పాత్రలే!!
ఇల్లునూ...!!!

మళ్ళీ పాపవే.... బాల్యమే....
ఇప్పుడు ఆలనా... పాలనా...?

మళ్ళీ శూన్యంలోకి....
తెలియని లోకం వైపుగా....
బతుకు
ఓ వలయం...
చిరునవ్వుల.... స్పందనల...దుఃఖాల
కలబోత....
ఆత్మీయత... ప్రేమ ఊట.....!!

---

## నిశీధి బతుకులు

- మల్లవరపు విజయ
9989326248



మిత్రమా !....
ఈ జనారణ్యంలో
నీలి నీడలు కమ్ముకుంటు
జాతి పరదాల చాటున
ఎన్ని కుటిల సింహాలు దాగున్నాయో
ఒక్కసారి తేరిపార చూడు....

తరతరాల మన
జాతి చరిత్రలో
నిశీధి ఛాయలు
పులుముకుంటూ
పూటగడవని
ఆకలి కడుపు లెన్నో...!

చిన్న పెద్ద తేడాలతో
అంటు - ముట్టు అనే జాడ్యంతో
కుల కుంపట్ల - వెంపట్లలో
మతాల మారణ హోమాలెన్నో...!!
ఆడ మగ అనే తేడాలతో

వరకట్నాల వేలం పాటలో
మానభంగాల మారణ
హోమాలతో
రగిలిపోతున్న రావణ
కాష్టాలెన్నో..!!

అతివృష్టి అనావృష్టి జాతరలో
ప్రకృతి ప్రసాదించిన
పచ్చని పైరు పంటకి
చీడ పురుగు పట్టి

పండిన పంటకు గిట్టుబాటు
ధరలు రాక
రుణాల వడ్డీలతో
రైతన్నలు ఆత్మహత్యలెన్నో....

ఓట్లను నోట్లపాలు జేసి
నీతి నియమాలు అవినీతి
తుంగనద్రొక్కి
అడ్డదారులు తొక్కిన
అధికారులు
వంశపారంపర్య సొత్తులా
రాజ్యమేలుతున్న
నాయకులెందరో...!!
జాతి పరదాల మాటున
ఎన్ని కొదమ సింహాలు
దాగున్నవో
తెరతీసి ఒక్కసారి చూడు !




# బంజార నానీల్లో - గిరిజన జీవితం

బోస్క సత్తమ్మ
9010797533

గిరిజనుల సంచార జీవన విధానం, నాగరికత పేరుతో ధ్వంసమైన బంజారుల సంస్కృతి, ఆచార వ్యవహారాలను, విలక్షణమైన - గిరిజన స్త్రీ ఆహార్యం, ధరించే నగలను గురించి, ప్రపంచీకరణ ప్రభావంతో మారిన ఆహారపు అలవాట్లను, గత జీవిత స్మృతులను, "బంజారా - నానీ"ల్లో వాస్తవికంగా చిత్రికరించారు రచయిత్రి డా॥ సూర్యాధనంజయ్.

నల్లగొండ జిల్లా మిర్యాలగూడెం సమీపంలోని "భల్లూ నాయక్" తండాలో జన్మించిన సూర్యది తెలుగు సాహిత్యంలో విలక్షణ స్వరం. అమ్మ యాడిని బాల్య జీవితాన్ని, తను ఎదిగొచ్చిన తండా జ్ఞాపకాలను తనివితీర తలుచుకుంటుంది.

"ఆ సువాసన / ఎక్కడి నుంచో తెలుసా / మాయాడి తొక్కునూరే/ రోటిలోంచి"

కవయిత్రికి అడవి జీవితం తెలుసు. బాల్యంలోనే ఎన్నో కష్టాలను ఎదుర్కొని, ఎదిగొచ్చిన జీవిత నేపథ్యం ఉంది. అందుకే కలవరిస్తూ... ఇలా.... "గుండె నిండా /తండా జ్ఞాపకాలు /ఎన్నటికీ వాడని /మమతల పూలు" మరో నానీలో అమ్మనాయిన గురించి ఇట్లా అంటారు. "మా అమ్మా నాన్నలు /మట్టి మనుషులు / అందుకే మా ప్రేమలో / ఇంత గట్టిదనం" లంబాడాల, శ్రమ జీవన సంస్కృతిని చిత్రిస్తూ "వారి చెమట/ వాగులై పారుతుంది / అయినా బతుకుల్లో /తడి కానరాదు" ప్రపంచీకరణ ప్రభావంతో తండా జీవితాల్లో వచ్చిన మార్పును కవిత్వీకరిస్తూ "తండాల్లో / జొన్న రొట్టెలు మాయం / ఫాస్ట్ ఫుడ్ సెంటర్లలో / వెదకండి" అంటుంది కవయిత్రి. గిరిజన తల్లుల వేదనని, ఆవేదనని తండ్లాటని కలవరిస్తూ రాసిన నానీలు అనేకం ఈ సంపుటిలో ఉన్నాయి.

"లంబాడి ఆడపిల్ల / చంప్లీ / చంపకండిరా / ఆది రేపటి చాంపియన్" ... "ఆడపిల్ల / అమ్మకు బరువైంది / పేదరికం/ ఎంత పని చేయించింది", తండా మట్టి తగిలితే అమ్మ జ్ఞాపకం వస్తుంది అంటుంది కవయిత్రి. తను ఎదిగొచ్చిన జీవితన నేపథ్యంను నానీల్లో వ్యక్తీకరించారు. "వేగుచుక్క వేళ / పెద్ద కోడి కూసింది / వెలుగు / యాడి మదిలో విరిసింది". "కొత్త వలసలు / భయం వెయ్యదా / మనస్సులో యాడి / యాడికైనా పర్వాలేదు". "తనువు/ తండా దాటింది గాని / గుండె నిండా / యాడి జ్ఞాపకాలే".

కవయిత్రి తన జీవిత ప్రయాణాన్ని తలుసుకుంటూ... "తండా బడి నుండి / ఉస్మానియా బడికి / మట్టిని చీల్చుకొని వచ్చే / మొక్కలా".

నూట ముప్పయికి పైగా, నానీలు ఉన్నయి సంకలనంలో... తెలంగాణ కోసం త్యాగం చేసిన గిరిజన వీరుల గురించి, బంజారాల ఆధ్యాత్మిక గురువుల గురించి, అనేకం. ఈ సంకలనంలో ఉన్నాయి.

# సింధూరపు దారుల్లో

పి. అనంతరావు
9640708826

నామౌనం చుట్టూ తిరిగే ప్రశ్నలు
సముద్ర ఘోషలా వినిపిస్తూ ఉంటాయి
గట్టు తెగిన కాలువలా
ప్రతిరోజూ ఈ నేలంతా
గందరగోళాల వరదలౌతుంటే
నాగుండె చప్పుడు వేగం
ఇంకా ఇంకా పెరిగిపోతూనే ఉంది
నిజం కోసం నిరంతరం ఆవేదనతో
వెతుకుతూనే వున్నాను
జండాలు కళ మీద కప్పుకొని
నినాదాలు నింగిమీదకు ఎగరేస్తూ
ఆడంబర కార్యక్రమాల్లో
మునిగిపోయిన వాళ్ళకి
నా మూలుగులు వినిపించడం లేదు
ప్రజల సమస్యల మీదనే
నాయకులు తమ కత్తులకు
సానపెట్టుకుంటున్నారు
బంధాల్ని కోసేస్తున్నారు
వారి వారి బంధాల్ని మాత్రం
గట్టిగా ముడివేసుకుంటున్నారు
ప్రజల్ని వైకుంఠపాళీలో ఇరికించి
కాలం భావోద్వేగంతో చక్రభ్రమణ చేస్తూనే వుంది



ప్రజల్ని కళ్ళు తిరిగేట్టు
తిప్పుతూనే ఉంది
వాళ్ళ వాగ్దానాలు వెలుగులు
చిమ్ముతూ ఉంటాయి
చేతలు మాత్రం పేదల కంట్లో
చీకట్లు నింపుతూ ఉంటాయి
ఎవరితో ఎవరు చర్చించుకోనక్కర్లేదు
నా మౌనంలో ఏ ఆవిష్కరణలు ఫలించవు
నేనూహించిన నిజం
కాలం చెప్పిన సత్యం
ఒక్కటే అయింది!
ప్రజలే ఎప్పుడూ ఓడిపోతున్నారు
నాయకులే జెండాలు ఎగరేస్తున్నారు
సంధ్యా సమయంలో పక్షులు
సమిష్టి జీవితానికి బాష్యం చెప్పినట్లు
ప్రజలందరు సమిష్టి సమస్యల సంఘర్షణలో
సింధూరపుదారుల్లో కంటకాలను ఏరివేస్తూ
ముందుకు నడిచినప్పుడే మాత్రమే
నా ఆవేదనకు ఊరట లభిస్తుంది
అంతవరకు నాలోని సముద్రఘోష
ఇలా మారుమోగుతూనే ఉంటుంది

---

తెలంగాణ గిరిజన స్త్రీ దుర్భర జీవితం ఎట్లా ఉందో చెపుతూ అనేక నానీలు రాసింది కవయిత్రి. "కట్టెలమ్ముకునే / అడవి వీరులు / కడుపమ్ముకోవడం / ఏం ఖర్మమో". "అరే అమ్మతనం / ఓడి పోయిందా / దారిద్రానికి / ఏదైనా సాధ్యమే". గిరిజన స్త్రీల జీవితంలో వెలుగు ఎప్పుడా అని విలపిస్తూ... "ఆమె జీవితంలో / చీకటి ముసుకుంది / తొలి పొద్దు / పొడిచేదెప్పుడో" గిరిజనుల వలసలు చెదిరిపోయిన తండాలు, స్త్రీల దుఃఖ జీవితం సామాజిక ఆర్థిక స్థితిగతులను ప్రతీకాత్మకంగా చెపుతూ... ''దుఃఖాన్ని / గంపలో మోసుకుంటూ / దూర్వ తండా నుండి / దుబాయిదాకా"... "సీతాఫలానికి / ఎన్ని కళ్ళో / సీత్లా బాయికి / ఎన్ని కన్నీల్లో". ధ్వంసమైన అడవి, ప్రకృతి సంపదలు, వనరుల దోపిడితో గిరిజన తండాలు ఎటున్నాయో చెపుతూ రచయిత్రి. "అడవుల్లో కూడా / చెట్లు లేవు / గిరిజన గుడిసెలకు / తూట్లు తప్ప".

నల్లగొండ జిల్లా బొర్రాయి పాలెం జాతరకు, తన బాల్య జీవితానికి ఉన్న సంబంధంను జ్ఞాపకం చేసుకుంటూ.. ''బొర్రాయపాలెం / షుగర్ అంటే ఇష్టం / అది నా బాల్యలోకంలో / తీపి జ్ఞాపకం". కవయిత్రి ఈ సంకలనంలో ఎక్కువగా గిరిజన వాడుక భాష పదాలు ప్రయోగించారు ( ఉదా: యాడి = అమ్మ. షుగర్ = లంగా) ఈ పదాలను రికార్డు చేయడం వల్ల, భాష, సంస్కృతుల్ని అధ్యయనం చేయడం సులువు అవుతుంది.

తండా జీవిత నేపథ్యం నుంచి, తెలుగు సాహిత్యలోకంలోకి విశ్వ విద్యాలయంలోకి, ప్రవేశించిన అరుదైన, కవయిత్రి డా॥ సూర్యాధనంజయ్ తన అస్తిత్వాన్ని పాడుతుంది.

"తండా మట్టిని తాకితే / యాడి / అది నిత్యమమకారాల / ఒడి /...... ఎప్పుడో ఏదో కోల్పోయిన బాధ / తర్వాత అర్థమయింది / నా తండా అస్తిత్వం".

తెలంగాణ గిరిజన తండాల తండ్లాటను, సమస్త బంజారా జాతుల దుఃఖాన్ని అస్తిత్వ, ఆకాంక్షలను, ఎత్తిపడుతుంది. బంజారాల నానీలో కవయిత్రి.

గిరిజన అస్తిత్వ నేపథ్యం నుంచి వచ్చిన ఈ సంకలనం ''తెలుగు సాహిత్యం''లో తొలి సంకలనం కావచ్చు. రచయితకు అభినందనలు

కథ

# ఇదో దగాకోరు కథ




- సిహెచ్. మధు
9949486122

ఈ కథకు ముగింపు లేదు కానీ ఫుల్‌స్టాఫ్ పెట్టకతప్పదు.... ఈ కథ ఇంకో కథకు మూలం కావచ్చు. అది వేరే సంగతి.

పోలీసులు న్యాయమూర్తి ముందు నలుగురు ఖైదీలను ప్రవేశపెట్టారు. రెండు రోజులుగా వీరి బెయిలు పిటీషన్ తన టేబుల్ మీద వుంది. ఏవో కారణాలతో ముందుకు సాగటం లేదు. న్యాయ స్థానాలలో చట్ట కారణాలుంటాయి. అవి కథలో చెప్పటం కథకు ఇంపుకాదు.

ఇందులో

ఇద్దరు ఖైదీలు ఒక కేసుకు

మరో ఇద్దరు ఖైదీలు మరో కేసుకు సంబంధించిన వారు. నలుగురి అరెస్ట్ మొన్ననే జరిగింది. నలుగురిని ఒకే కేసు క్రింద అరెస్ట్ చేసారు. అయితే ఈ నలుగురు పూర్వ పరిచయం వున్న వారు కాదు. ఒకరికి ఇంకొకరు కొత్త. అయినా ఒకే కేసు క్రింద అరెస్ట్ అయ్యారు. – వీరు నలుగురు రైతులే!

ఈ నలుగురికి బెయిల్ యివ్వక తప్పదనుకున్నాడు న్యాయమూర్తి. పోలీసులు పెట్టిన కేసు చదివాడు. పెద్ద కేసు కాదు. బెయిల్ యిస్తే కొంపలు మునుగవు. ప్రభుత్వ ప్రయోజనానికి వచ్చిన నష్టం లేదు. అయినా రైతులకు ఇదేం బుద్ధి ? – అనవసరంగా కష్టాలు కొని తెచ్చుకుంటారు? ప్రభుత్వంతో సహకరిస్తే పోయేదిగా అనుకున్నాడు న్యాయమూర్తి.

న్యాయమూర్తి ఆలోచనలలో వ్యవస్థ లక్షణాలున్నాయి.

అసలు ఈ కథ పూర్వపరాలేమిటి? – నలుగురు రైతులను ఎందుకు అరెస్ట్ చేసారు?

సంవత్సరం క్రితం దామోదర్‌రెడ్డి అనే మంత్రి మెదక్‌లో జరిగిన ఒక బహిరంగ సభలో ఒక హామీ యిచ్చారు. “మెదక్ జిల్లాలో ఎన్నో బంజరు భూములున్నాయి. సాగుకు రావల్సిన ఖాళీ భూములున్నాయి. భూమి యిస్తాం దున్నుక బ్రతకండి!” అన్నారు. అది ప్రభుత్వ పాలసే. మంత్రిగారి స్వంత నిర్ణయం కాదు. అది మంత్రిగారి స్వంతభూమి కాదు. ప్రజల భూమి ప్రజలకు యిస్తానంటున్నాడు. అసలు దేశంలో వున్న మొత్తం భూమిని సాగుభూమి లేని ప్రజలకు లెక్కలు తీసి తలా ఎంత వస్తే అంత యివ్వాలి. ప్రజల భూమి ప్రజలకు, కానీ మంత్రిగారి మాట తన భూమి ఏదో యిచ్చినట్టుగా... ప్రకటన... అందుకు ప్రజల చప్పట్లు... అస్మదీయుల కీర్తనలు...

మంత్రి ప్రకటన తర్వాత భూమిలేని పేదలు ప్రభుత్వానికి అప్లికేషన్స్ పెట్టుకున్నారు. ప్రభుత్వం వద్ద అన్ని పెండింగ్‌లో వున్నాయి. జిల్లాలో ఎక్కడెక్కడ సర్కారు భూమి వుంది? ఎవరు లెక్కతీసింది లేదు. లెక్క చేసింది లేదు. అసలు ఆ అప్లికేషన్స్ పట్టించుకున్న నాధుడు లేడు. సంబంధిత ఆఫీసులో దుమ్ము పట్టి పోతున్నాయి. జనం భూమి జనానికి పంచటం దుమ్ముపట్టుకపోయింది.

మంత్రి దామోదర్ రెడ్డి హామీ యిచ్చినట్టుగా ఈ సంవత్సర కాలంలో భూమి లేని రైతులకు పంచలేదు. జనం ఆశలు పెండింగ్‌లో వున్నాయి. వారి కనులు నిరీక్షిస్తున్నాయి. వారి మనసులు అనుమానిస్తున్నాయి.



ఆశ గొప్పదిగా.... తాము ఓటువేసి గెలిపించిన ప్రభుత్వమనే నమ్మకం ప్రజలకు మామూలేగా! – అయినా వేల జనం మధ్య మంత్రి గారిచ్చిన హామీ.... ఎలా తప్పుతారు? ఇది ప్రజల నమ్మకం..... అయినా మంత్రి సొంత సొమ్ము యివ్వటం లేదుగా ప్రజల సొమ్ము ప్రజలకు యివ్వటానికి వెనుకా ముందు ఎందుకలా? ఇది ప్రజల ధీమా.....

అయితే

ఈ సంవత్సర కాలంలో మెదక్ జిల్లా ప్రజలకు కోపం తెప్పించే సంఘటన ఒకటి జరిగింది.

మెదక్ జిల్లా మొత్తం హైద్రాబాద్ నగరానికి ఆనుకొని వుంటుంది. హైద్రాబాద్ నగరమంటే రాష్ట్ర రాజధాని ఈ దృష్ట్యా మెదక్ జిల్లా పరిశ్రమలకు అనువైన ప్రాంతంగా ప్రభుత్వం భావించింది. పరిశ్రమాధిపతులు భావించారు. ఆర్థిక సంస్కర్తల పుణ్యమా అని ఎన్నో పరిశ్రమలు వచ్చిపడుతున్నాయి. ఉత్పత్తి సంగతేమిటో కానీ బోర్డులు వెలుస్తున్నాయి. ప్రభుత్వ ప్రయోజనాలు పొందుతున్నాయి.

ఒక కార్పొరేట్ సంస్థ (ఈ సంస్థకు సంబంధించిన కొన్ని కంపెనీలలో మంత్రి దామోదర్ రెడ్డి శేర్లున్నాయి అది వేరే సంగతి) లారీల విడిభాగాల తయారు పరిశ్రమను పెడతామని భూమి కొరకు ప్రభుత్వానికి అప్లైచేయటం ప్రభుత్వం అంగీకరించటం వారం రోజులలో జరిగిపోయాయి.

లారీల విడిభాగాల తయారీ పరిశ్రమ వారు ప్రభుత్వాన్ని 2000 ఎకరాలు కావాలన్నారు. ప్రభుత్వం వెయ్యి ఎకరాల ప్రభుత్వ స్థలాన్ని ఉచితంగా, మిగితా వెయ్యి ఎకరాలు రైతుల నుండి ఖరీదు చేయటానికి అనుమతి ఇచ్చారు.

ఇటువంటి కార్పొరేట్ సంస్థలకు అడ్డు ఏముంది? దేశంలో కార్పొరేట్ సంస్థలకు ఎర్ర తివాచీ పరుస్తున్న రోజులివి ప్రభుత్వం వారిది.

అంతా సాఫీగా జరుగుతుందని కార్పొరేట్ సంస్థ భావించింది. కానీ కొందరు రైతులు తను భూమిని అమ్మటానికి ఒప్పుకోలేదు. ఎలా ఒప్పుకుంటారు? తరతరాల భూమి నిరంతరం అన్నం పెట్టే భూమి జీవనోపాధి భూమి. తమ ప్రాణంలో ప్రాణం. భూమి ఒప్పుకోలేదు. ప్రాణం పోయినా యివ్వమన్నారు.

పైసలిస్తున్నారుగా.... ఆ పైసలతో ఎలాగైనా బ్రతుకొచ్చుగా.... భూమి నమ్ముకొని బ్రతికే రోజులున్నాయా? ఇలా ఎవరన్నా రైతులు వినలేదు. కొందరు డబ్బులు తీసుకున్నారు. భూమి నమ్ముకున్నారు. కొందరు అమ్మటం లేదు. వినటం లేదు. మొండికేస్తున్నారు. వీరితో వచ్చింది చిక్కంతా....

బ్రోకర్లు నచ్చచెప్పారు. దళారీలు ఒత్తిడి తెచ్చారు. కార్పొరేట్ సంస్థల గూండాలు రౌడీలు బెదిరించారు. పోలీసులు జోక్యం చేసుకున్నారు. దామోదర్ రెడ్డి (మంత్రి) మనుష్యులు అల్లరి చేసారు.

ఆ కొందరు ఎవరి మాట వినటం లేదు. కార్పొరేట్ సంస్థకు వీరి విషయం చిక్కుగానే వుంది. ఇలా వుండగా.....

భూమి లేని తాము బ్రతుకు దెరువు కొరకు సాగు చేసుకోవటానికి మిగులు భూమి అడిగితే మంత్రిగారు యిస్తానని యివ్వలేదు కానీ ఒక కార్పొరేట్ సంస్థకు అప్పనంగా ఇస్తున్నారనే గుర్రు ప్రజలలో వుంది. ప్రజల మనసులు వుడుకుతున్నాయి.

ఒక సమస్య మీద కొందరు రైతులు కోపంగా వుంటే మరో సమస్య మీద మరి కొందరు మంటగా వున్నారు. రెండు సమస్యలు ఒకటే సాగుభూమి సమస్య.

ఇంతలో

మంత్రి దామోదర్ రెడ్డి మెదక్ వచ్చాడని గెస్ట్‌హౌస్‌లో

వున్నాడని తెల్సి - ఆ రైతులు కొందరు ఈ రైతులు కొందరు గెస్ట్‌హౌస్ ముందు జమ అయ్యారు. ఇది మామూలే. సమస్య ఆలాంటిది. సమస్య వుంది కనుక రైతులు మంత్రి ముందుకొచ్చారు. రైతుల మనసులు కాలుతున్నాయి కనుక ఎవరికి వారే తేల్చుకుందామని వచ్చారు.

మంత్రిని కలువాలన్నారు

కుదరదన్నారు

నినాదాలు మొదలయ్యాయి

అటూ ఇటూ ఏకమయ్యారు

సమస్య ఆలాంటిది

అపరిచిత ముఖాలు ఎవరికి వారే వచ్చి అందరూ ఒకటయ్యారు. జనం సమస్య మీద ఏకమవుతారు.

కొందరికి సాగు చేసుకోవడానికి భూమికావాలి.

మరికొందరికి సాగుచేస్తున్న తమ భూమి తమ చేతుల నుండి పోకూడదు.

మంత్రి జనాన్ని కలువటానికి యిష్టపడలేదు. తీరిక లేదన్నారు. తీరిక లేకపోవటం కాదు ముఖం లేదు.

జనం అల్లరి... నినాదాలు... పోలీసులు

ప్రవేశం ....లాఠీల హుంకరింపు రైతులు పరుగులు కొందరి ఎదిరింపు... ఈ నలుగురి అరెస్ట్..... ఇది జరిగిన కథ.

ఈ కథలో నలుగురి పేర్లు అవసరమా? అవసరం లేదు. రైతులు వారు వారి పేరు భారతదేశ రైతులు.

నలుగురు రైతుల బెయిల్ పిటీషన్ న్యాయమూర్తి ముందు వుంది. బెయిల్ యివ్వాలి... యిచ్చే ముందు న్యాయమూర్తి రైతుల అభిప్రాయాలు అడిగాడు.

ఇద్దరు రైతులు ఒకేమాట చెప్పారు. "మేము సాగు చేసుకోవటానికి మిగులు భూమి యిస్తానని యివ్వలేదు.

న్యాయమూర్తి అన్నాడు "మిగులు వుంటే యిస్తారు"

" ఆ కంపెనీకి యిచ్చారుగా?" ఆ నలుగురిలో ఓ కరక్కాయ వున్నాడు వుంటాడు అడిగాడు.

"అదే ప్రజల కోసమేగా దేశాభివృద్ధికి" అన్నాడు న్యాయమూర్తి.

"మా కడుపు కొట్టి దేశాభివృద్ధి చేయాలా? అడగాలను కున్నాడు. దొరికే బెయిల్ దొరకకపోతే... భయం. ఇక్కడ జనం సమస్యలు ఇలాగే వుంటాయి. ఒక సమస్యపోతుంది.... మరో సమస్య ముందుకొస్తుంది. హక్కులు పోతాయి భయం మిగులుతుంది. ఒక సమస్య పోయి రెండు సమస్యలవుతాయి. మనం ఒకవేళ జీరోలమైతే పోలీసులు హీరోలవుతారు. సమాజం బలహీనత ప్రభుత్వానికి తెల్సు కనుకే రెండవ సమస్య సృష్టించి మొదట సమస్యను పరిష్కరిస్తారు.

రెండో సమస్య గూర్చి కూడా న్యాయమూర్తి ప్రశ్నించారు.

"పెద్ద కంపెనీ పెడుతున్నపుడు భూములిస్తే తప్పేముంది. డబ్బులిస్తున్నారుగా ఉద్యోగా లొస్తాయిగా" అన్నాడు న్యాయమూర్తి.

సమస్యను పరిష్కరిద్దామని న్యాయమూర్తి ఉద్దేశ్యం. ప్రభుత్వానికి సహాయం చేయాలనే మనసు కూడా వుంటుంది,.. ఎంతైనా వ్యవస్థలో వారో భాగం.

కరక్కాయ వూరుకోలేదు "ఎవరికి ఉద్యోగాలు... డబ్బులు దండిగా యిస్తామంటే మీరు ఈ ఉద్యోగం నుండి వెళ్లిపోతారా?

సూటిగా చూచాడు న్యాయమూర్తి వీరిని

రైతుల న్యాయవాది కరక్కాయను బెదిరించి సరే సార్ ! అన్నాడు.

బెయిల్ దొరికింది కేసు మిగిలింది

కథ అయిపోయింది కానీ ఇదీ కథలో భాగమే కావచ్చు. ఆనాటి రాత్రి మంత్రి దామోదర రెడ్డి న్యాయమూర్తికి ఫోన్ చేసి (స్నేహితులు వీరు. స్నేహిత సంబంధాలతో) కొత్తగా స్థాపిస్తున్న లారీల విడిభాగాల ప్యాక్టరీ లాభదాయకం గా వుండేలా వుంది. కొన్ని షేర్లు పెట్టుబడి పెట్టండి! అన్నాడు మామూలుగా

జవాబు చెప్పలేదు న్యాయమూర్తి ఆయన మనసులో సుప్రీంకోర్టు న్యాయమూర్తులు ఒకరో ఇద్దరో తమ వాళ్ల షేర్లు రిలయన్స్‌లో వున్నాయని అంగీకరించినట్టు జ్ఞాపకమొచ్చింది.

# ప్రపంచీకరణపై ఎక్కుపెట్టిన కవిత్వం 'కాలం మీద సంతకం'

- వి.పవన్ కుమార్ రెడ్డి
76740 34914




*'అయినా ధైర్యంగానే, పొగచూరిన ఆకాశం, ఆకుపచ్చని సజీవ సముద్రం నా నేల' వంటి కవితా సంపుటిల్ని వెలువరించారు. గత రెండు దశాబ్ధాలుగా ప్రపంచీకరణ, సరళీకృత ఆర్థిక విధానాలు ఎటువంటి దుష్ఫలితాలను కల్గిస్తున్నాయో అద్దేపల్లి కవిత్వంలో మనం దర్శించవచ్చు. ప్రపంచీకరణను వ్యతిరేకించే కవులలో మొదటి వరుసలో ఉంటారు కవి అద్దేపల్లి రామమోహనరావు.*

ప్రముఖ కవి, విమర్శకులు అద్దేపల్లి రామమోహనరావు గారు రాసిన 'కాలం మీద సంతకం' కవితా సంపుటి 2013 లో వెలువడింది. ఇది వరకే ఈయన 'అయినా ధైర్యంగానే, పొగచూరిన ఆకాశం, ఆకుపచ్చని సజీవ సముద్రం నా నేల' వంటి కవితా సంపుటిల్ని వెలువరించారు. గత రెండు దశాబ్ధాలుగా ప్రపంచీకరణ, సరళీకృత ఆర్థిక విధానాలు ఎటువంటి దుష్ఫలితాలను కల్గిస్తున్నాయో అద్దేపల్లి కవిత్వంలో మనం దర్శించవచ్చు. ప్రపంచీకరణను వ్యతిరేకించే కవులలో మొదటి వరుసలో ఉంటారు కవి అద్దేపల్లి రామమోహనరావు.

ప్రపంచమంతా ఒక కుగ్రామంగా మారటమే ప్రపంచీకరణని, ప్రపంచీకరణంటే అమెరికీకరణగా స్థిరపడిపోయిందని అనుభవంలోకొచ్చిన సత్యం. నూటికి తొంభై శాతం మంది ప్రపంచీకరణ వల్ల నష్టపోతున్నారు. కేవలం పది శాతం మందికి మాత్రమే ప్రపంచీకరణ ఫలాలు అందుతున్నాయి, వారే లాభపడుతున్నారు. ఇటువంటి తీవ్రమైన వ్యత్యాసాల్ని కవులు చూస్తూ ఊరుకోరు. వ్యత్యాసాల్ని కల్పిస్తున్న విధానాల్ని ప్రశ్నిస్తారు, ధిక్కరిస్తారు. ఈ కవితా సంపుటిలోని సగానికి పైగా కవితలు ప్రపంచీకరణ విధానాలపై ఎక్కుపెట్టిన కవితాస్త్రాలే. వాటిలో కొన్నింటిని ఇక్కడ పరిశీలిద్దాం.

సామ్రాజ్యవాదం యొక్క పరాకాష్ట దశ లేదా పరిణత రూపం ప్రపంచీకరణ. సామ్రాజ్యవాది స్వభావమే దోపిడీ స్వభావం. సామ్రాజ్యవాదానికి కొనసాగింపే ప్రపంచీకరణ. అందుకే దీనిని సామ్రాజ్యవాద ప్రపంచీకరణ అని సంబోధిస్తుంటారు. సామ్రాజ్యవాది యొక్క దోపిడీ స్వభావాన్ని కవి "వసంత రసాయనం" అనే కవితలో ప్రతీకాత్మకంగా వ్యక్తీకరించాడు.

"ఉన్నట్లుండి తోటలోకి ఒక రాకాసి ప్రవేశించాడు. /వాడి కళ్ళు టెర్మినేటర్లు / వాడి నాలుక ప్లాస్టిక్ షీటు/ వాడి నోరు సూర్యుడస్త మించే గుహ / వాడి కాళ్ళు చేతులూ మారణాయుధాలు / వాడొక భూతయంత్రంలా ప్రవేశించాడు / కోకిలని పిచ్చిపాటలు పాడమంటాడు / చెట్లన్నీ కూల్చి పిట్టల్ని తరిమేస్తానంటాడు /నాకు తోట అక్కర్లేదు./ ఈ నేల కావాలని గర్జిస్తున్నాడు" (పు.37)

ఇక్కడ 'వాడు' అనే పదం సామ్రాజ్యవాదికి ప్రతీకగా వాడిన పదం. అద్దేపల్లి కవిత్వంలో వాడు అనే పదం తరచుగా కనిపిస్తుంది. అభ్యుదయ కవిత్వంలో వాడు అనేది వర్గశత్రువుకు ప్రతీకగా వాడబడింది. వర్గశత్రువులు రూపాలు మార్చుకుంటున్నారు. మారిన వర్గశత్రువులకు ప్రతినిధి సామ్రాజ్యవాది. సామ్రాజ్యవాది అనే రాకాసి మన తోటలోకి

ప్రవేశించి, మారణాయుధాలతో ఈ నేల మీద లభించే సకల వనరులనూ దోచుకుపోతున్న దృశ్యాల్ని కవి చూపించాడు.

ప్రపంచీకరణ మూడవ ప్రపంచ దేశాలపై దుష్ప్రభావాన్ని ప్రసరించింది. వర్ధమాన దేశాలపై ప్రపంచీకరణ విష ప్రభావాన్ని కవి "నేటి వసంతుడు" అనే కవితలో వెల్లడించాడు. మనిషి అనేవాడు గ్లోబల్ మనిషి అవడం వల్ల జరిగే పరిణామాల్ని ఈ కవితలో మనం చూడొచ్చు. "ఇవ్వాళ నేను గ్లోబల్ మనిషిని / జపానులో అణురియాక్టర్లు పేలితే / నా యింటి ముందు ఆమ్ల వర్షం కురుస్తోంది. / ఏ దేశం మీద సాయుధ విమానాలెగిరినా / నా గుండెలో బాంబులు పేలుతున్నై / ప్రపంచంలో ఏ మూలనో స్విచ్చి పగిలితే / నా యింట్లో పవర్ కట్ ఔతోంది / ఎక్కడో ఆర్థిక సూత్రం పుటుక్కున తెగితే / దారం వచ్చి నా మెడకు చుట్టుకుంటోంది" (పు.22)

ప్రపంచంలో ఎక్కడో ఏ మూలనో ఏదో జరిగితే వర్ధమాన దేశాలపై దాని ప్రభావం పడటం ప్రపంచీకరణ వల్ల కల్గిన దుష్ప్రభావం. మన జీవితాల మీద, మన ఆర్థిక వ్యవస్థ మీద ప్రపంచీకరణ విషాన్ని ఎగజిమ్ముతుంది. ప్రపంచంలోని అన్ని దేశాల ఆర్థిక వ్యవస్థలనూ సంలీనం చేసి ఆయా దేశాలలో స్థూల రాజకీయర్థిక విధానాల నుంచి అతి చిన్న విషయాల దాకా అన్నింటినీ సామ్రాజ్యవాదం ప్రభావితం చేస్తున్నప్పుడు ఆ ప్రభావం అన్ని దేశాలపై ప్రసరిస్తుంది. అమెరికాలోనైనా, జపాన్‌లోనైనా జరిగిన సంఘటనల, సంక్షోభాల ప్రభావాలు ప్రపంచ దేశాలన్నింటిపై పడుతున్నాయి. ప్రపంచీకరణ వల్ల వర్ధమాన దేశాలన్నింటికీ ప్రతికూల ప్రభావాలు తప్పనిసరిగా సంభవిస్తుంటాయి అనే వాస్తవాన్ని కవి ఈ కవితలో ధ్వనింపజేశాడు.

ప్రపంచీకరణ నేపథ్యంలో చేతివృత్తులు, కులవృత్తులు వంటి ఇతర జీవనోపాధి వృత్తులు అంతరించిపోతున్నాయి. కులవృత్తులు వంటివి ఇంకా కొనసాగించబడాలి అనేది నేటి ఆకాంక్ష కాదు. ఆయా వృత్తులు చేసుకొనే వారికి ప్రత్యామ్నాయాలు కల్పించకుండా ప్రభుత్వాలు నిర్లక్ష్యం వహిస్తున్నాయి. సొంత ఊరు నుంచి సొంత వృత్తి నుంచి అనేక మంది వలసలుపోతున్నారు.

సామ్రాజ్యవాది యొక్క కుట్రపూరిత విధానాల మూలంగా వివిధ వృత్తుల వారు, రైతులు కోలుకోలేని దెబ్బతింటున్న విషయాల్ని కవి 'పుర్రె' అనే కవితలో తెలిపాడు. "వాడెవడో / బీడీలు చుట్టే మెత్తటి చేతుల మీద / బహుళజాతి సిగరెట్ల ప్రణాలుగా ప్రవేశించాడు / నేతగాళ్ళ కాళ్ళ మీద / టెక్స్‌టైల్ పార్కుల పాములాగా పడగలెత్తాడు / తాటిచెట్ల మొవ్వుల్లో కల్లుకుండల మీద / విదేశీ మద్యాల హాలాహలంలా కమ్ముకున్నాడు / పచ్చటి ప్రాణాలు మొక్కల్లో దాచుకున్న పేదరైతుని / మొక్కకిందనే పూడ్చిపెట్టే వేరుపురుగై విస్తరించాడు"(పు.51)

*మన ప్రభుత్వాలు వివిధ వృత్తులు చేసుకునే వారికి ప్రత్యామ్నాయం కల్పించకుండా బహుళజాతి కంపెనీలకి స్వాగత తోరణాలు కడుతున్నాయి. రైతులు, చేనేతలు, కల్లుగీత కార్మికులు ఎంతోమంది ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. కాబట్టి ప్రజలంతా ఏకమై పరాయివాడి భావాలకి మంటపెట్టి, సామ్రాజ్యవాదిని మనదేశం నుంచి తరిమికొట్టడమే పరిష్కార మార్గంగా కవి సూచిస్తాడు.*

మన ప్రభుత్వాలు వివిధ వృత్తులు చేసుకునే వారికి ప్రత్యామ్నాయం కల్పించకుండా బహుళజాతి కంపెనీలకి స్వాగత తోరణాలు కడుతున్నాయి. రైతులు, చేనేతలు, కల్లుగీత కార్మికులు ఎంతోమంది ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. కాబట్టి ప్రజలంతా ఏకమై పరాయివాడి భావాలకి మంటపెట్టి, సామ్రాజ్యవాదిని మనదేశం నుంచి తరిమికొట్టడమే పరిష్కార మార్గంగా కవి సూచిస్తాడు.

2006లో పుర్రెగుర్తు వ్యతిరేక నినాదంతో సాగిన బీడీ పోరాటంలో లక్షలాది మంది బీడీ కార్మికులు రోడ్డెక్కారు. 2010లోనూ బీడీ కార్మికులు కొత్తవేతన ఒప్పందం కోసం సమ్మె చేశారు. బీడీ పరిశ్రమ చేతి పరిశ్రమ, పూర్తిగా మానవ శ్రమమీద ఆధారపడినది. ఇందులో యంత్రాల వినియోగం లేదు. ప్రపంచీకరణ విధానాల నేపథ్యంలో దేశవాళీ పరిశ్రమలు మూతపడుతున్నాయి.

బీడీ కార్మికుల పోరాట నేపథ్యంలో అద్దేపల్లి వెలువరించిన కవిత "బీడీ కాగడా" / "బీడీ కట్ట మీద / పుర్రె గుర్తు వేసేముందు / బ్రాందీ సిసా మీద / అస్థిపంజరం గుర్తువెయ్యండి..../అస్థిపంజరాలు సింహాసనం మీద / బహుళజాతులు ఎగరేస్తున్న / విజయపతాకం బ్రాందీసిసా! / దమ్ముంటే దానిమీద / అస్థిపంజరం గుర్తువెయ్యిండి / బీడీకట్ట మీది పుర్రె / పేదల జీవితాలకి ప్రతీక / బక్క చిక్కిన దేశీయవృత్తులకి సంకేతం" (పు.100)

సిగరెట్లు, బీడీలు, మద్యం ఆరోగ్యానికి హానికరమైనవి. వీటన్నింటిపైనా పుర్రెగుర్తులు వెయ్యాలి. ఎందుకంటే అవి మానవ ప్రాణానికి ముప్పు కల్గించేవి. అయితే బహుళ జాతుల ప్రయోజనాలకై బక్కచిక్కిన దేశీయ వృత్తుల్ని అంతమొందించే ప్రయత్నం చేస్తున్నారు. స్వదేశీ ఉత్పత్తుల స్థానంలో విదేశీ

## కవిత

### నానీలు

- బి. గోవర్ధనరావు
9441968930



శిశిరం రాల్చినా
వసంతం పూసినా
రెండింటికీ వృక్షమే
మహా భాష్యం!

నిద్రలో
నానీల కలలు
వేకువలోనూ
తారకలై మెరిసాయి

కాలాన్ని
నేర్చుకుంటున్నాడా!
అయితే తనకు తాను
అర్థమవుతున్నట్లే

సాయంలేక
వ్యయసాయం
అవశేషమైతే
మరి ! నాగలి శిలాజం అయిందా!

బడా మార్కెట్
చివరి కౌంటర్‌లో
రైతున్నాడు
అమ్మకాని కన్నట్లు !

చీమ చిన్నదే
దాని నుండి
నేర్చు విషయం మాత్రం
మనకు గొప్పదే !

జీవితాన్ని నేర్పినా
గాయాన్ని మాన్పినా
ప్రతిభా పాటవమంతా
కాలానిదే !

శిల్ప సంపదనిచ్చిన
'ఉలి' ఏదీ!
ఇంకా కళల్ని
దిద్దుతోందా! ఎక్కడ?

## పుల్లెల శ్రీరామచంద్రుడు కన్నుమూత



పద్మశ్రీ అవార్డు గ్రహీత, ప్రముఖ సంస్కృతాచార్యులు పుల్లెల శ్రీరామచంద్రుడు (88) హైదరాబాద్‌లోని తన స్వగృహంలో జూన్ 24న కన్ను మూశారు. ఆయన 200కి పైగా సంస్కృత, ఆంగ్ల, ఆంధ్ర గ్రంథాలను రచించారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం సంస్కృత విభాగం అధిపతిగా, సంస్కృత అకాడమీ సంచాలకుడిగా, సురభారతి కార్యదర్శిగా, సంస్కృత భాషా ప్రచారక్ సమితి కులపతిగా, సంస్కృత భాషాభివృద్ధికి విశేష కృషి చేశారు. ఆయన తెలుగులోకి అనువదించిన 'వాల్మీకి రామాయణం' ప్రాచుర్యం పొందింది. రాజమండ్రి సమీపంలోని కోనసీమలో ఇందుపల్లి గ్రామంలో 1927 అక్టోబర్ 24న జన్మించిన రామచంద్రుడు ఆరు దశాబ్దాల క్రితం హైదరాబాద్ వచ్చి స్థిరపడ్డారు. వాల్మీకి రామాయణాన్ని తెలుగులో అనువదించటంతో పాటు... తెలుగు, సంస్కృతంలో ఆయన విరివిగా రచనలు చేశారు. పుల్లెల సంస్కృత అకాడమీలో దశాబ్దానికి పైగా సేవలు అందించటంతో పాటు ఉస్మానియా యూనివర్సిటీలో సంస్కృత విభాగం అభివృద్ధికి పాటుపడ్డారు. 2011లో కేంద్ర ప్రభుత్వం పద్మశ్రీ అవార్డుతో సత్కరించింది.

బహుళజాతి సంస్థల నూతన ఉత్పత్తులు ముందుకొస్తున్నాయి. వీటిని ప్రతిఘటించాలి.

ప్రపంచీకరణ నేపథ్యంలో పతనమవుతున్న సంస్కృతిని మనం మన కళ్లారా చూస్తున్నాం. పాశ్చాత్య సంస్కృతి అలవడిన మనదేశంలో మనదైన సంస్కృతి అంతరించిపోతుంది. భాష, కళలు, విద్య, ఆటపాటలు ఇవన్నీ కూడా సంస్కృతిలో భాగం. వీటన్నింటినీ నేడు వ్యాపారమయం చేశారు. కళలు సమాజ పురోగతికి తోడ్పడేవి. అలాంటి కళాత్మకమైన గాన సంస్కృతిని డబ్బుతో జబ్బు సంస్కృతిగా చేసిన వైనాన్ని గురించి కవి 'ఐ-డాల్' అనే కవితలో వాపోయాడు. "ప్రపంచం డబ్బులోకి ముడుచుకుపోయి / డబ్బు వ్యాపారస్థుల సంచీల్లో కరుచుకుపోయి / డబ్బు సంచీలు డబ్బు సంచీల్ని ఒరుసుకుపోయి / డబ్బుకీ బ్రహ్మానందానికీ ముడివేసే కుట్రలో / సామాన్య ప్రజలందర్నీ వెర్రిపర్రలుగా మార్చి / డబ్బు మూటల్తో జబ్బు దాన్సులు చేస్తూ / ఒక మహోన్నత గాన సంస్కృతిని / డబ్బులో సమాధి చెయ్యడం కళ్లెదుట చూస్తున్నాను" (పు.76)

ప్రపంచీకరణ నేపథ్యంలో మార్కెట్ సంస్కృతి ప్రవేశించాక, అది సాంస్కృతిక కళారూపాలన్నింటినీ వ్యాపారమయం చేస్తావుంది. పై కవితలోని దృశ్యాలు అందుకు సజీవ సాక్ష్యాలు.

ప్రపంచీకరణ నేపథ్యంలో అనుకరణ భావాలు ఎక్కువయ్యాయి. ఇది వరకు మధ్య తరగతి వర్గంలో అనుకరణ ఎక్కువగా ఉండేది. ఇప్పుడు అన్ని వర్గాలు అనుకరణ బాట పట్టాయి. కవి కలం నుండి నుండి వెలువడ్డ 'నేనే నా దేశం' అనే కవిత పరాయీకరణ భావాల్ని ప్రస్ఫుటించింది. "ఈనాడు పల్లె పట్టణాన్ని ప్రేమిస్తోంది /పట్టణం నగరాన్ని ప్రేమిస్తోంది / నగరం మరెవర్నో ప్రేమిస్తోంది / మనిషిని ప్రేమించే మనిషి మాత్రం / తన ముఖం తనకు కనిపించక / ద్వేషాన్ని ప్రేమిస్తున్నాడు" (పు.107)

ప్రపంచీకరణ నేపథ్యంలో వివిధ వృత్తులు, సంస్కృతి, మానవ సంబంధాలు విధ్వంసమౌతున్న తీరును ఇదే కవితా సంపుటిలో మరిన్ని కవితలు ప్రతిఫలించాయి. వర్తమానం మీద చెరగని సంతకం చేసిన కవి అద్దేపల్లి.

దాశరథి రంగాచార్య
(24.08.1928 - 08.06.2015)



# జీవితాన్ని చదివి, నేర్చుకొని రాయాలి

- డాక్టర్ దాశరథి రంగాచార్య

***నవలాకారుడుగా, బహు విషయ వ్యాఖ్యాతగా మీరు రూపొందడానికి దారి తీసిన పరిస్థితులేమిటి ?***

ఉద్యమాలే! రచయితలుగా ఆచార్యులు గాని, నిర్దేశకులు గాని నాకెవరూ లేరు. పోరాటమే నేర్పింది. అంత ఎవరూ నేర్పలేరు. పోరాటమే జీవితం అర్థమయేలా చేసింది. నేను జీవితాన్ని నగ్నంగా చూశాను. 'అమ్మ' నవల కూడా ప్రభావితం చేసింది. దేవులపల్లి వెంకటేశ్వరరావు నాయకత్వంలో జనగామలో జరిగిన ప్రజల వీరోచిత పోరాటాల ప్రభావం వుంది. రజనీపామీదత్తు 'ఇండియా టుడే', మినూమసానీ 'అవర్ ఇండియా' కూడా ప్రభావం చూపాయి. అప్పట్లో అమ్మ నవలపై నిషేధం. ఎక్కడో ఒక కాపీ దొరికితే రోజుకొకరు చొప్పున చదివెయ్యాలి. దీపం వెలుగులో చదివేవాళ్ళం. అలాటి ఒక రాత్రి మా ఇంట్లో దొంగలు పడి ఎత్తుకు పోయారు! నేను పోరాటంలో పూర్తిగా ఇన్‌వాల్వ్ అయ్యాను. ఆ రోజులు అలాంటివి. నాకు 16 -17 ఏళ్ళు ఉంటాయి. నా ఈడు వాళ్ళు చాలా మంది పోరాటంలో పాల్గొని ప్రాణాలు పోగొట్టుకున్నారు. అందుకు కారణం నాటి పరిస్థితులా లేక ప్రజా వెల్లువ ప్రభావమా అంటే.... నిజాం నిరంకుశత్వం 300 ఏళ్ళ నుంచి వుంది. అయితే కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన ఉద్యమం వుంది. కాబట్టి అంతటి కదలిక వచ్చింది. తెలంగాణాలో వున్న పరిస్థితులే బీహార్, యు.పి., ఎం.పి. వంటి చోట్ల వున్నాయి. అయినా తిరుగుబాటు రాలేదెందుకని? ఈ మధ్య నేనేదో సభకు వెళ్ళినపుడు లక్నోలో ఎవరో నన్నడిగారు. తెలంగాణాలో కమ్యూనిస్టు పార్టీ వుండటమే అందుకు కారణమని చెప్పాను. ప్రేమ్‌చంద్ నవలలు చదవండి తెలంగాణా పరిస్థితులే మనకు కన్పిస్తాయి. అందుకే ఆయన రచనలు తెలంగాణా ప్రాంతంలో బాగా ప్రాచుర్యం పొందాయి. అదే కోస్తా ప్రాంతంలో శరత్ సాహిత్యం చదువుతారు. మళ్ళీ పోరాట కాలానికొస్తాను. అప్పట్లో వేము ప్రాణాలు వదలుకోడానికి సిద్ధపడే ఉద్యమంలోకి దూకాం. మా అన్న దాశరథిని అరెస్టు చేసిన నైజాం పోలీసులు ఉదయం పూట తీసుకెళ్ళడానికి జంకారు. ప్రజల నుండి ఆగ్రహం వ్యక్తమవుతుందని, నిజంగా వచ్చేదో లేదో తెలియదు గాని అలా అనుకున్నారు. నన్ను కస్టడీలోకి తీసుకున్నారు. ఖాసిం అని పాకిస్తాన్ నుండి వచ్చిన పోలీసు అధికారి నన్ను బాగా కొట్టాడు. చంపేయాలనుకున్నాడు. కాని వాడు అటు పోగానే అఫ్జల్ అనే పోలీసు నన్ను రమ్మన్నాడు. నేను బతికి వున్నందుకు సంతోషంతో ఫలహారం ప్యాకెట్ ఇచ్చి ఇది నా 'తోఫా' అన్నాడు. కొట్టినపుడు ఏడ్వని నేను ఈ ప్రేమకు చలించి ఏడ్చాను. అలాగే మా వూళ్ళో రజాకార్ల వెంట తిరిగే ఒక యువకుడు నన్ను ఎత్తుకుని ప్రహరీ గోడ దాటించాడు. అలా తప్పించుకున్నాను. ఈ వివరాలన్ని నా ఆత్మకథ 'జీవనయానం'లో రాశాను.

***మోదుగుపూలు, మాయాజాలతారు, జనపదం, చిల్లరదేవుళ్ళు వంటి నవలల్లో తెలంగాణా జన జీవితాన్ని అంత చక్కగా చిత్రించడానికి ఎలాంటి జాగ్రత్తలు తీసుకున్నారు ?***

ఇన్‌వాల్వ్‌మెంట్, డివోషన్ అంతే. నేను సనాతన కుటుంబంలో పుట్టాను. సంస్కృతం నేర్చుకున్నాను. కమ్యూనిస్టు పార్టీలో చేరాక అవి చదివి తప్పు చేశాననుకున్నాను. అన్నీ మరచిపోయాను. బయటకువచ్చాక రామాయణ, భారతాలు చదివాను. క్యారక్టరైజేషన్ అంతకన్నా పర్‌ఫెక్ట్‌గా ఎక్కడా

వుండదు. వాల్మీకి శైలి నా కెంతో ఇష్టం. గోర్కీ 'అమ్మ' ప్రభావం వుంది. వట్టికోట ఆళ్వారుస్వామి ప్రభావం పెద్దగా వుందనుకోను. అతని జీవితం కొంత స్ఫూర్తినిచ్చింది. అతన్నుంచి ఏమీ తీసుకోలేదు. 'ప్రజల మనిషి', 'చిల్లర దేవుళ్ళు' కథా కాలం ఒక్కటే. నేను ప్రజల మనిషి ముగిసిన దగ్గర నుంచి ఈ నవల ఎత్తుకుని వుండొచ్చు. కాని అలా చేస్తే వేరే వారి నవలలా వుంటుందనుకున్నాను. నేను తెలంగాణాలో మాట్లాడే భాషలో రచన చేయడం గొప్ప సాహసం. చాలా మంది నన్ను ఆ భాషలో రాయవద్దని గొడవ పెట్టారు. మన భాషను చులకన చేయాలని రాస్తున్నావా అన్నారు. అది కేవలం న్యూనతాభావం ఫలితమే. అలా రాసేందుకు ఎంత మందిని నేను వ్యతిరేకించానో తెలియదు. ఇందాక చెప్పినట్లు ఆ రెండు నవలలది ఒకే కథాకాలం. 1930లో నిజాం కాంగ్రెస్‌ను నిషేధించారు. రాజకీయ కార్యకలాపాలను కూడా. ఆ కాలాన్ని తీసుకున్నాను.

***మీరు తెలంగాణా వాడుక భాషలో రాసినా, రచయిత వర్ణనలు వచ్చినపుడు మామూలు భాషే రాశారు. 'మాయాజలతారు'లో చిన్న చిన్న వాక్యాలు ఎంతో హాయిగా చదివిస్తాయి. భాష విషయంలో ప్రత్యేక జాగ్రత్తలు తీసుకున్నారు.***

చిల్లర దేవుళ్ళు చదివి డి.వి.నరసరాజు మేమెవరం ఇలా రాయలేం అన్నారు. నేను నవల రాసినా, వేదం రాసినా జనానికి అర్థం కావాలనే కాంక్షతో రాశాను. ఇక శిల్పం, నేను చదివిన ప్రాచీన కావ్యాల ప్రభావం కావచ్చు. నాలో శిల్ప దోషం లేదు. నేను ఏదో యాదృచ్ఛికంగా రచయితను కాలేదు. కావాలని అయ్యాను. నిజానికి నేను కవినై వుండాల్సింది. వట్టికోట ఆళ్వారు స్వామి పోయాడు. ఇక తెలంగాణా గురించి నేను నవలలు రాయకుంటే ఇకెవరు రాస్తారు? అనే ఆలోచించాను. నవలల గురించి చాలా చదివాను. 'హౌ టు రీడ్ ఎ నావల్' అనే పుస్తకం చాలా శ్రద్ధగా చదివాను. ఆ విధంగా కృషి చేసిన మాట నిజమే. నా శైలిలో స్వత్తసిద్ధంగా అందం వుంటుంది. సూర్యుడు వున్నపుడు కూడా బ్యాటరీ వేసుకుంటామంటే ఎలా? కాళిదాసు సహజ ప్రతిభతో రాస్తాడు. భారవి అలా రాయలేదు. స్వత్తసిద్ధంగా శైలిలో అందం ఉండాలి.

***దోపిడీకి ప్రాతినిధ్యం వహించే పాత్రలను కూడా మీరు సానుభూతితో చిత్రించినట్లు కొన్ని సార్లు అన్పిస్తుంది. ఉదాహరణకు చిల్లర దేవుళ్ళులో దొర... దీనివల్ల దోపిడీదారులపై రావలసిన ఆగ్రహం రాదు కదా ?***

నేను జీవితాన్ని ఏ ఇజం కోణం నుండి చూడలేదు. మనిషిని మనిషిగా సందర్శించాను. 'జనపదం'లో మంగమ్మ గొప్ప లీడర్. ఒక సందర్భంలో కాలు జారుతుంది. ఇలా రాసినందుకు చాలా మంది నన్ను విమర్శించారు. అంత గొప్ప వ్యక్తిత్వాన్ని అలా ఎందుకు చిత్రించావని ప్రశ్నించారు. ఎంత గొప్పతనమున్నా మనిషి కదా? మనుషులు తప్పులు చేస్తారు. కమ్యూనిస్టులైనా సరే.. 'నా కాశ్యం, నాపరాధ్యతి' అంటాడు వాల్మీకి,. దోపిడీ వర్గాల పాత్రలను సహజంగానే చిత్రించానే గాని వాళ్ల మీద నేను సానుభూతి చూపలేదు. కథలో జనం చూపిస్తారు. బలరామయ్య దొర చేసినంత దౌర్జన్యం ఎవరూ చేయలేదు. అయినా ఆయన అవిటి వాడైనప్పుడు జనం 'అయ్యో' అన్నారు. అది మానవ బలహీనత. నేను ఆ పాత్రలను సహజంగా చిత్రించానేమో గాని పోరాటాన్ని చెడగొట్టలేదు.

***తెలంగాణా పోరాటాన్ని చక్కగా ప్రతిబింబించిన మీరు ఆ తర్వాతి పోలీసు చర్యను 'మోదుగుపూలు'లో సమర్థించారు. సైన్యం వచ్చాక కూడా అత్యాచారాలు జరిగాయి కదా ?***

'మోదుగుపూలు' మిలటరీ ప్రవేశిస్తుండటంతో ముగుస్తుంది. అంతే నేను పోలీసు చర్యను సమర్థించలేదు. 'జనపదం' చదివి, దీన్ని చదివితే అలా అనిపించదు. కథలో రఘు గాంధేయవాది. అయినా తుపాకీ పట్టుకున్నాడు. కానీ తహసిల్దారును కాల్చలేదు. ఇంకోవైపున సైన్యాలు కూడా ప్రవేశిస్తున్నాయి. అలాటి దశలో ముగించాను. అయితే అక్కడ 'భూమి గుండ్రంగా వుంది. ఉద్యమాలు ఎక్కడి నుంచి బయలుదేరాయో అక్కడికే చేరుకున్నాయి. అని నేను రాసిన వ్యాఖ్యను మాత్రం కొంత మంది మిత్రులు విమర్శించారు. 1971 - 72లో ఆనాటి పరిస్థితిలో నేను అలా రాశాను. ఆశావహ పరిస్థితులేమీ లేవు. కమ్యూనిస్టు ఉద్యమం చీలిపోయి ఉంది. ఎక్కడినించి బయలుదేరామో అక్కడకు వచ్చామనిపించింది. అంతే గాని పోలీస్ చర్యలను నేను సమర్థించలేదు. ఆ చర్య భారత పాలకవర్గాల రక్షణ కోసం తీసుకున్నదే గాని ప్రజల కోసం కాదు. హైదరబాద్ విలీన స్వర్ణోత్సవాల సందర్భంలో నేను ఈ విషయమై రెండు వ్యాసాలు రాశాను.

***చాలా దశాబ్దాల కిందటే మీరు రామాయణం వగైరాలు రాశారు. ఇప్పటికీ వేదాల గురించి రాస్తున్నారు. కమ్యూనిస్టు ఉద్యమానికి ఎంతో సంఘీభావం తెలిపే మీరు సంప్రదాయవాది కూడానా ?***

నేను సంప్రదాయ వాదినని అనుకోను. అయితే అదేమీ నేరం కాదు. నేను సంప్రదాయాన్ని వ్యాఖ్యానిస్తాను. అనుసరించను. నేను సంప్రదాయాన్ని వదిలిపెట్టలేదు. వదిలిపెట్టాలా? దేశం కమ్యూనిస్టు ప్రభుత్వం వస్తే నేను మతాన్ని వదులుకోవడానికి సిద్ధంగానే వుంటాను.

***ఒక సీనియర్ రచయితగా మీ అనుభవం నుంచి సాహిత్య సామాజిక ప్రయోజనం గురించి చెప్తారా ?***

సాహిత్యానికి వున్నదే సామాజిక ప్రయోజనం. ('హితం కరోతి సాహిత్యం' విశ్వశ్రేయఃకావ్యం' ఇలాంటి నిర్వచనాలు మనకు ఏనాటి నుంచో వున్నాయి. ఏ రకంగానైనా సమాజానికి మేలు చేసేదే సాహిత్యం. ఇంగ్లీషులో లిటరేచర్ అనే పదానికి అంత విస్తృతమైన అర్థం లేదు. వాళ్లు కంప్యూటర్ లిటరేచర్, సైన్స్ లిటరేచర్ ఇలా అంటూ వుంటారు. భారతీయ సిద్ధాంతం ప్రకారం మనం వాటిని సాహిత్యం అనం. అలాగే క్రైం సాహిత్యం, సెక్సు సాహిత్యం అంటూ వుండవు. వాటిని క్రైం పుస్తకాలు అనొచ్చు. నవలల్లో వ్యక్తివాదం తక్కువ. రచయిత అల్లం రాజయ్య చిల్లరదేవుళ్ళు చదివి, ఆ కథ జరిగిన వూరు చూసేందుకు వెళ్ళి వచ్చాడట. తెలంగాణాలోనే కాదు, బయట కూడా చాలా మంది నా పుస్తకాలు చదివి నాకు రాస్తుంటారు. నా జీవన యానంలో అవన్నీ రాశాను. వేదంలో ఏం లేదనేవాళ్ళు, అన్నీ వున్నాయనే వాళ్లు, ఎవరూ వాటిని చదవలేదు. వాటిలో కులం లేదు, మతం లేదు, వసుధైక కుటుంబం అన్నారు.

***వాస్తవంగా ఏముందనే ప్రశ్న ఒకటి. సామాజికంగా గతంలో అవి నిర్వహించిన పాత్ర, ఈనాడు ఛాందస శక్తులు వాటిని ఉపయోగించుకుంటున్న తీరు కూడా మనం పరిగణనలోకి తీసుకోవాలి కదా ?***

స్వప్రయోజనపరులు ఏం చెప్తారనేదాన్ని బట్టి మనం ప్రతిస్పందిస్తే ఎలా? రామాయణం, భారతం అద్భుతమైన కావ్యాలు. భారతంలోనైతే ఇంకా దేవతలు, మనుషులు కలిసి సమాజం కోసం పని చేయడం కనిపిస్తుంది. మనం వాటిని చదవకుండానే ఏవగింపు, అసహ్యం డెవలప్ చేసుకున్నాం. గాంధీ గారొక్కరే రాముణ్ణి సరిగ్గా ఉపయోగించుకున్నారు.

***రామాయణం రాసి రాముడికి అంకితమిచ్చిన మీరు ఈనాడు 'రామజన్మభూమి' పేరిట జరుగుతున్న తతంగాన్ని ఏమంటారు ?***

రాముణ్ణి వాళ్ళు రాజకీయంగా వాడుకుని ఓట్లు పొందుతున్నారు. వాళ్ళని తగినంతగా ఎక్స్‌పోజ్ చేయలేకపోయాము. భారత ధర్మం మీద బి.జె.పి. వాళ్ళకు వున్నంత వ్యతిరేకత ఎవరికీ లేదు. ఈ సమాజం నినాదాల వెనక పోతుంది. చదివే ఓపిక ఎవరికీ లేదు. 'సామాజిక పరిణామంలో నడకే గాని పెద్ద అంజలు ఉండవని' కృష్ణమీనన్ ఒకసారి చెప్పాడు. టర్కిష్ భాషలో 'హిందూ' అంటే దొంగ అని అర్థం. 'హిందుస్థాన్' అనే మాట ఎక్కడా లేదు. అయినా ఈనాటికి మనం దాని నుంచి బయటపడలేదు. భారత్ అనకుండా వాజ్‌పేయి కూడా ఇండియా అంటూ వుంటారు. రాజకీయ ప్రయోజనాలకు శుష్క నినాదాలు బాగా పనికొస్తాయి. యాభై ఏళ్ల స్వాతంత్ర్యం తర్వాత గతంలో లేని కుల మతతత్వాలు ఈ దేశంలో ప్రబలడానికి అదే కారణం. కమ్యూనిస్టులు బలంగా లేకపోవడం, అనైక్యత, ఇతర కారణాలు క్లింటన్‌కు వ్యతిరేకంగా ఉద్యమం చేయడం నాకు ఎంతో సంతోషం కలిగించింది.

***అయితే ఇప్పటికీ తెలుగులో గొప్ప నవల రాలేదన్న అభిప్రాయంపై మీ ప్రతిస్పందన ?***

నేను ఏ మాత్రం ఒప్పుకోను. ఒక సభలో కొమ్మూరి వేణుగోపాలరావు అలాగే అన్నాడు. నేను జోక్యం చేసుకుని ఖండిస్తూ మాట్లాడాను. నవల అంటే ఒక జాతికి ప్రతీక. నవల సామాజిక సాహిత్యానికి ప్రతీక. మంచి నవల రాలేదనడం జాతిని తక్కువ చేయడమే. మనకు డెబ్భై ఏళ్ళ క్రితమే 'మాలపల్లె' వంటి మహా నవల వచ్చింది. అందుకని ఇవన్నీ స్లోగన్స్. ఇలా అనే వాళ్ళు ఆ నవలలు చదవలేదు. 'మాలపల్లె' గురించి మనం గర్వంగా వుండొచ్చు. రావిశాస్త్రి, వాసిరెడ్డి సీతాదేవి, బీనాదేవి ఇలాంటి రచయితలురాసినవి వున్నాయి కదా. అవే పర్‌ఫెక్ట్ అని కాదు. మన దృక్పథం నుంచి సామాజికంగా ఎంత మంచివనేది ముఖ్యం. శిల్పరీత్యా చూస్తే రావిశాస్త్రి సంపూర్ణ నవల ఏదీ రాయలేదు.

***మరి కుటుంబరావు ?***

నా ఉద్దేశంలో ఆయన ఆర్టిస్టు కాదు. కథలు కొంచెం మెరుగు. ఆయన నవలలో 'చదువు'ను చెప్తుంటారు. అదైనా శిల్పం మీద శ్రద్ధ చూపిందికాదు. కొన్ని సిద్ధాంతాలు భుజాన వేసుకోవడం వల్ల అవి ఆకర్షించలేవు. కాళీపట్నం రామారావుకు అసలు శిల్పమే లేదు. శ్రీశ్రీని తీసుకోండి తెలంగాణా పోరాటానికి అందరూ స్పందించారు. ఆయన తప్ప. అంతటితో ఆగక నిజాం సంస్థానంలోనూ పని చేశారు. ఆయనేం విప్లవ కవో! అయితే ఆయనకు ఒక నడక వుంది. అది చాలా గొప్పది.

***కవిత్వం, నవల వాటిపట్ల ఆదరణను ఎలా అర్థం చేసుకోవాలంటారు ?***

కార్లయల్ దగ్గర ఈ ప్రశ్నకు సమాధానం లభిస్తుంది. 'సమాజంలో ఫ్యూడల్‌తత్వం ఎంత ఎక్కువగా వుంటే కవిత్వానికి అంత ఎక్కువ గౌరవం వుంటుంది' అంటాడాయన. మనం అక్కడి నుంచి బయటపడలేదు. ఆంధ్ర జాతి స్థితి అది. ఏమైనా కవిత్వాన్ని ఇగ్నోర్ చేయడానికి లేదు. ఆధునిక సమాజానికి నవల ప్రాతినిధ్యం వహించాలి. వచన రచయితలలో సన్యాసం పొందిన వారిలో నేను మొదటివాణ్ణి. నాకు రావలసిన గుర్తింపు రాలేదని ఆ మధ్యన ఎవరో రాశారు. నేను ఒప్పుకోలేదు. నేను చేసినదానికి మించి ప్రజలు నన్ను గౌరవించారు. సత్కారాలు చేశారు. నా జీవనయానం, ఇప్పుడు వేదం జీవననాదం రచనలకు, పాఠకుల నుంచి ప్రముఖ రచయితల వరకు ఎందరో అభినందనలు తెలియచేస్తున్నారు. అవార్డులు వచ్చాయి. రాలేదన్నది ముఖ్యం కాదు. ప్రాణాలు

## పదాలే....

ముకుంద రామారావు
9908347273



గాలిలా
పదాలు
నీవి నావి అందరివీ
ఎవరైనా వాడుకోవచ్చు

వెలుగులా చీకటిలా
ఎవరైనా అందులో తడవొచ్చు
కొందరికి
మందులమ్మే వాడిలా
నిశ్చితమైనవే కావాలి

మనల్ని మనకు
లేదా బయటకు
చూపించే అద్దంలా
కొందరికి కొన్ని పదాలు
తమవెంతో పరాయివీ అంతే

కొన్ని తలుపులు మూసేస్తాయి
కొన్ని అనేక తలుపులు
తెరుస్తాయి

పరాయి పదాల భాషలా
ఇతరుల బాధ

నీడకు జన్మనిచ్చి
నీడతో ఆటాడుకుని
నీడను చంపుతుంది
వెలుగు
పదాలూ అంతే

బహుశా పదాలే
వాటి జ్ఞాపకాలతో
ఆత్మను కెలుకుతూ ఉంటాయేమో

## పచ్చని సంసారం

డా॥ మల్లెమాల వేణుగోపాల రెడ్డి
9908591998

మా ఇంటి మేడ టెర్రస్ పైన
రోజూ కనిపించే దృశ్యం
ఒక చిలకా, ఒక గోరింకా
ఎప్పుడూ కాట్లాడుకుంటూ
అరుస్తూ, కరుస్తూ

గోరింక ముక్కుతో
చిలుకను గుచ్చి గుచ్చి,
పొడిచి పొడిచి
గోళ్లతో రక్కుతుంటే

చిలక, ముక్కుకు దొండపండు
అందివచ్చినట్లభినయిస్తూ
గోరింకతో మరులు
పంచుకుంటున్నదనుకోనా?

గోరింక పురుషాధిక్యతను
పరోక్షంగా
ప్రదర్శిస్తున్నదనుకోనా?
ముఖమంతా కందిపోయినా
కంఠంలో జీరమారినా
చిలక, గోరింకతో గోడు
చేస్తూంది



పచ్చని చిలుకల పరువాలలో
దాగిన దాంపత్యరహస్యం
మనిషికి గొప్ప సందేశం
జీవితంలో పదనిసలు
సంసారంలో చిటపటలూ
నిస్సందేహంగా నిజమే.... మరి
చిలకా గోరింకల్లా
సర్దుకుపోతే దొరికేది
"పచ్చని సంసారం....
వెచ్చని దాంపత్యం "

---

పోతాయనుకున్నప్పుడే ఉద్యమంలో దూకినవాళ్లం. అవార్డుల కోసం రాయలేదు.

**ఈనాటి యువ రచయితలకు మీ సూచనలు ?**

జీవితాన్ని, సమాజాన్ని చదవండి. నేర్చుకోండి. రాయండి. చదవకుండా, నేర్చుకోకుండా రాయొద్దు. అయితే ఈనాటి యువ రచయితల నుంచి ఏం రాలేదనడం తప్పు. మంచి సాహిత్యం వస్తున్నది. మంచి కథలు, కవితలు వస్తున్నాయి. నవలలు ఆ స్థాయిలో రాని మాట నిజమే. అయినా విమర్శకులు వున్న మంచిని చూపించాలి. అల్లం రాజయ్య, కాలువ మల్లయ్య, బి.ఎస్.రాములు వంటి వారు మంచి రచనలు చేస్తున్నారు. నవల రాలేదంటే... పోరాటంలో నుంచి వచ్చిన వాళ్ళు రాయాలి. ఏమైనా సోషలిజం బ్రతుకుతుంది. అదొక ప్రత్యామ్నాయ ఆర్థిక సిద్ధాంతం. జీవన విధానం. సోవియట్ విచ్ఛిన్నమై వుండొచ్చు. 75 ఏళ్ళ తర్వాత ఎందుకు పోయిందని బాధపడటం కాదు. రాక్షసమైన ఈ అమెరికా దాడిని తట్టుకుని 75 ఏళ్ళు నిలబడటంలోని గొప్పను గుర్తించాలి. రేపు మరేదైనా సోషలిస్టు దేశానికి దెబ్బతగలచ్చు. చరిత్రలో అలాంటి ఆటుపోట్లు సహజం. సిద్ధాంతాల మంచి చెడ్డలు ఆచరణల మీద ఆధారపడి లేవు. అక్షరాలా మార్పు రాసిందాని ప్రకారమే సోషలిజం రాలేదు. కనుక సోషలిజం బ్రతికే వుంటుంది. దానికి చావులేదు.

**ఇంటర్వ్యూ: తెలకపల్లి రవి**

(దర్పణం సాహిత్య ప్రత్యేక సంచిక )

## బ్రాహ్మణవాదం - మూలాలు



- డా॥ కత్తి పద్మారావు

వెల : 300/- పేజీలు: 497

ప్రతులకు : 9849741695

ఇది సిద్ధాంత గ్రంథం డా॥ అంబేద్కర్ ఈ భావజాలాల మీద ఎంతో కృషి చేశారు. అయితే ఆధునిక పరిణామాలు, అన్వాయాల నుండి ఈ గ్రంథాన్ని విశ్లేషణాత్మకంగా రచించాను. ఈ గ్రంథాన్ని పాజిటివ్ దృక్పథంతో చదివితే ఎక్కువ మేలు జరుగుతుంది.

- కత్తి పద్మారావు

## కళ్యాణపురం యానాం కతలు-2



- దాట్ల దేవదానం రాజు

వెల : 100/- పేజీలు: 160

ప్రతులకు : 9440105987

గతాన్ని వర్తమానంలో చెప్పడం, వర్తమానానికి గతాన్ని నేపథ్యంగా ఉపయోగించడం, గతాన్ని చరిత్రగా వ్యాఖ్యానించడం, వర్తమానాన్ని వర్తమానంగా ప్రదర్శించడం - ఈ నాలుగు విధాలు రాజుగారికి బాగా చేతనౌనని ఈ కథలు రుజువు చేస్తున్నాయి. ఏ కథ రాస్తున్నా చరిత్రను, చారిత్రక పరిణామాలను విస్మరించకపోవడం రాజుగారు జాగ్రత్తగా చేసిన పని.

- రాచపాళెం చంద్రశేఖర రెడ్డి

## ఆకుపచ్చని సంతకం



పసుమర్తి పద్మజవాణి

వెల : 50/- పేజీలు: 86

ప్రతులకు : 9908853081

మనుషులు నిజమైన సహచరులుగా నిలబడలేకపోతున్న కాలంలో కవిత్వమొక్కటే నిజమైన సహచరుడూ, సహచరి అని నమ్మింది కాబట్టే పద్మజవాణి కవిత్వానికి ఊపిరూదింది, కవిత్వం పద్మజవాణికి ఊతమిచ్చింది.

- డా. అద్దేపల్లి రామమోహన రావు

## కె.వి.ఆర్.



సామాజిక వ్యాసాలు

వెల : 300/- పేజీలు: 750

ప్రతులకు : 9849083137

2012 జనవరిలో 'మహోదయం', 2013 జనవరిలో 'కె.వి.ఆర్. సాహిత్య వ్యాసాలు - మొదటి భాగం', 2014 జనవరిలో 'సాహిత్య వ్యాసాలు - రెండు, మూడు భాగాలు' అచ్చయ్యాయి. ఇప్పుడు 'సామాజిక వ్యాసాలు' ప్రచురించాం.

- కె.వి.ఆర్. శారదాంబ స్మారక కమిటీ

## జంతుప్రపంచం



బాలల కోసం జంతు పరిచయం

- టి. శాంతాభాస్కర్

వెల : 90/- పేజీలు: 88

ప్రతులకు : 9908441523

వివిధ పక్షులు, కీటకాలు, జంతువులలో కొన్నింటిని పరిచయం చేయడమే ఈ రచన ముఖ్య ఉద్దేశ్యం. ఇందులో నేలపై నివసించేవి, గాలిలో ఎగిరేవి, నీటిలో ఈదులాడేవి ఇలా వివిధ రకాల జంతువుల గురించి తెలుసుకోవచ్చును.

- టి. శాంతాభాస్కర్

## చేసి చూద్దాం రండి!



పిల్లల కోసం సైన్సు కృత్యాలు

- టి. శాంతాభాస్కర్

వెల : 110/- పేజీలు: 91

ప్రతులకు : 9908441523

సైన్సు పట్ల ఆసక్తిని, అభిరుచిని పెంపొందించే ఈ కృత్యాలలో మొదట సులభంగా దొరికే వస్తువులతో ప్రారంభిస్తే మిగిలినవి చేసేందుకు సులభంగా ఉంటుంది. శాస్త్రం పట్ల అవగాహన పెంపొందించుకొని, మరికొన్ని కృత్యాలు కనుగొనే స్థాయికి విద్యార్థులు ఎదగాలని ఆశిస్తూ...

- టి. శాంతాభాస్కర్

## అనంతపురంలో శ్రీశ్రీ వర్ధంతి



అనంతపురంలోని జనవిజ్ఞానవేదిక కార్యాలయంలో జరిగిన శ్రీశ్రీ వర్ధంతి సభలో ప్రసంగిస్తున్న సింగమనేని నారాయణ.

సమానత్వపు సమాజం కోసం పరితపించిన మహాకవి శ్రీశ్రీ అని ప్రముఖ కథా రచయిత శింగమనేని నారాయణ పేర్కొన్నారు. శ్రీశ్రీ మహాకవి 32 వర్ధంతిని పురస్కరించుకొని ప్రజాశక్తి సాహితీసంస్థ, సాహితీ స్రవంతి, సంయుక్త ఆధ్వర్యంలో జూన్ 15న అనంతపురంలోని జనవిజ్ఞాన వేదిక జిల్లా కార్యాలయంలో శ్రీశ్రీ వర్ధంతి సభ జరిగింది. జెవివి నాయకులు ప్రజ్ఞా సురేష్ అధ్యక్షతన జరిగిన సభలో ముఖ్య వక్తగా హాజరైన సింగమనేని నారాయణ మాట్లాడుతూ తెలుగు సాహిత్యాన్ని గొప్పగా ప్రభావితం చేసిన వారిలో శ్రీశ్రీని మించిన వారు లేరన్నారు. తెలుగు సాహిత్యాన్ని శ్రీశ్రీ ముందు, తర్వాత ఒక విభజన రేఖగా చూడాలన్నారు. 1934 తర్వాత తెలుగు సాహిత్యంలో శ్రీశ్రీ ప్రస్థానం చాలా వేగంగా వ్యాపించిందన్నారు. నూతన భావజాలాన్ని ఆహ్వానిస్తూ తన సాహిత్యం ద్వారా సమాజాన్ని జాగృతం చేశారన్నారు. ఈ కార్యక్రమంలో సాహితీ స్రవంతి కన్వీనర్ కుమారస్వామి, కవులు ఉద్దండం చంద్రశేఖర్, మధురశ్రీ, షేక్ రియాజుద్దీన్ అహ్మద్, పోకూరి చంద్రశేఖర్, భాస్కర బాల భారతమ్మ, ప్రజాశక్తి సాహితీసంస్థ ప్రతినిధి రవిచంద్ర, ఎస్ఎఫ్ఐ జిల్లా కార్యదర్శి కె ఆంజినేయులు తదితరులు పాల్గొన్నారు.

## కర్నూలులో శ్రీశ్రీ వర్ధంతి

మహాకవి శ్రీశ్రీ వర్ధంతి సందర్భంగా కర్నూలులోని లలిత కళాసమితి ఆడిటోరియంలో ప్రజానాట్య మండలి, ప్రజాశక్తి సాహితీ సంస్థ, సాహితీ స్రవంతిల ఆధ్వర్యంలో శ్రీశ్రీ 32వ వర్ధంతి సభ, అభ్యుదయ మధుర గీతాల సంగీత విభావరి జరిగింది. ఈ సందర్భంగా ప్రభుత్వ జూనియర్ కాలేజీ ప్రిన్సిపాల్ డాక్టర్ కె చెన్నయ్య, అధ్యాపకులు బాలశౌరి, లలిత కళాసమితి అధ్యక్షులు పత్తి ఓబులయ్య, ప్రముఖ గాయకుడు మహ్మద్ మియా, సాహితీ స్రవంతి నాయకులు మహేష్ తదితరులు శ్రీశ్రీ ఆశయాలు, ఆలోచనలను వివరించారు. ఈ సందర్భంగా శ్రీశ్రీ రచించిన పలు అభ్యుదయ, మధురగీతాలను పాడి అహుతులను అలరింపజేశారు. ప్రజానాట్యమండలి కళాకారిణి ఆర్ఎ సుజాత వెలుగు నీడలు సినిమాలోని పాడవోయి భారతీయుడా, మాంగల్య బలం సినిమాలోని ఆకాశ వీధిలో అందాల జాబిలి అనే మధుర గీతాన్ని ఆలపించారు. ప్రజానాట్య మండలి కళాకారులు ఎంపి బసవరాజు, సుంకన్న, సంజీవరాజు తదితరులు శ్రీశ్రీ రచించిన



సినిగేయాలను పాడి ప్రేక్షకులను అలరింపజేశారు. వి.లక్ష్మీనారాయణ ప్రదర్శించిన అల్లూరి సీతారామరాజు ఏకాపాత్రాభినయం ఆకట్టుకుంది. ఈ కార్యక్రమంలో ప్రజానాట్యమండలి జిల్లా అధ్యక్ష, కార్యదర్శులు ఆర్ఎ వాసు, మద్దిలేటి, బసవరాజు, ప్రజాశక్తి సాహితీ సంస్థల ప్రతినిధులు టి నర్సింహ, పి.చంద్రయ్య, సాహితీ స్రవంతి నాయకులు జె రఘుబాబు, కెంగార మోహన్, మహేశ్, శ్రీశ్రీ వర్ధంతి నిర్వహణ కమిటీ కన్వీనర్ జె ఎన్ శేషయ్య పాల్గొన్నారు.

## సాహితీస్రవంతి ఆధ్వర్యంలో కడపలో శ్రీశ్రీ వర్ధంతి



శ్రీశ్రీ నివాళులర్పిస్తున్న దృశ్యం

తన గీత రచనలతో ఎంతోమంది అభిమానులను సంపాదించుకున్న మహాకవి శ్రీశ్రీ అని సాహితీస్రవంతి జిల్లా ప్రధాన కార్యదర్శి ఎస్.మస్తాన్ వలి అన్నారు. శ్రీశ్రీ వర్ధంతి రాయల్ రషీద్ అసోసియేషన్ కార్యాలయంలో నిర్వహించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ శ్రీశ్రీ ఎన్నో సినీచిత్రాలకు గీతాలు అందించారని పేర్కొన్నారు. అనేక జాతీయ గీతరచనలు గావించారని తెలిపారు. శ్రీశ్రీ చిత్రపటానికి పూలమాలవేసి నివాళులర్పించారు. కార్యక్రమంలో రిటైర్డ్ ప్రిన్సిపాల్ డాక్టర్ హరేరామమూర్తి, వైఎస్ఆర్సిపి నాయకులు అబ్దుల్‌వాజీద్, రాయల్‌రషీద్, ఆర్ఆర్ సంఘం అధ్యక్షులు షేక్‌రాయల్ కరీముల్లా పాల్గొన్నారు.



విశాఖపట్నం సాహితీస్రవంతి ఆధ్వర్యంలో జూన్ 15న శ్రీశ్రీ వర్ధంతి సభలో శ్రీశ్రీ, దాశరథిలకు నివాళి అర్పిస్తున్న శాసనమండలి సభ్యులు ఎం.వి.ఎస్. శర్మ, ప్రముఖ కవి అద్దేపల్లి రామమోహనరావు, విశాఖ సాహితీస్రవంతి బాధ్యులు ఎ.వి. రమణారావు, రమణాచలం, నూనెల శ్రీనివాసరావు తదితరులు



ఖమ్మం పట్టణంలో తెలంగాణ సాహితి, ప్రజానాట్యమండలి ఆధ్వర్యంలో జూన్ 15న శ్రీశ్రీ విగ్రహానికి పూలమాల వేసి నివాళి అర్పిస్తున్న దృశ్యం. చిత్రంలో కె. ఆనందాచారి, దేవేంద్ర, సంపటం దుర్గాప్రసాద్, కపిల రాంకుమార్, సదానందం తదితరులు

## తెలుగు విశ్వవిద్యాలయం సాహితీ పురస్కారాలు

తెలుగు సాహిత్యంలో వివిధ ప్రక్రియల్లో ఉత్తమ రచనలకు పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం సాహితీ పురస్కారాలు ప్రకటించింది. 2012 సంవత్సరానికి పద్య కవితా ప్రక్రియలో డా.రాళ్ళబండి కవితా ప్రసాద్ 'సప్తగిరి రామ కలియుగ సార్వభౌమ' గ్రంధానికి సాహితీ పురస్కారం లభించింది. వచన కవితా ప్రక్రియలో పొన్నాల బాలయ్య 'దండెడ' కవితా సంపుటి బహుమతికి ఎంపికైంది. బాల సాహిత్యంలో ఆలపర్తి వెంకట సుబ్బారావు 'శృతిలయలు', కథా ప్రక్రియలో పలమనేరు బాలాజీ 'గదిలోపలి గోడ", నవలా ప్రక్రియలో పెద్దింటి అశోక్‌కుమార్ 'జిగిరి' నవల సాహితీ పురస్కారాలకు ఎంపికయ్యాయి. సాహిత్య విమర్శలో డా.కత్యాయని విద్మహే 'సాహిత్యాకాశంలో నగం', నాటక ప్రక్రియలో కె.వి.ఎల్.ఎన్.శర్మ 'లపంగి నాటకం', అనువాద విభాగంలో గోవిందరాజు రామకృష్ణారావు 'అనంతాకాశం', వచన రచనల్లో డా.సుంకిరెడ్డి నారాయణరెడ్డి 'ముంగిలి తెలంగాణ ప్రాచీన సాహిత్యం', రచయిత్రుల గ్రంధాల్లో డా.కె.కుసుమారెడ్డి 'తెలుగు నృత్య కళా సంస్కృతి' పురస్కారాలకు ఎంపికయ్యాయి. పురస్కారం కింద రూ.20,116/-లు. శాలువ, పురస్కార పత్రంతో సత్కరిస్తామని వర్సిటీ ఉపాధ్యక్షుడు ఆచార్య ఎల్లూరి శివారెడ్డి తెలిపారు.



తెలంగాణ సాహితి హైదరాబాద్ నగర కమిటీ ఆధ్వర్యంలో జూన్ 15న సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో నిర్వహించిన శ్రీశ్రీ వర్ధంతి సభ. ఈ సందర్భంగా నగర కమిటీ వెలువరించిన "అక్షర తొలకరి" కవితా సంకలనాన్ని ఆవిష్కరిస్తున్న ప్రముఖ కవి నిఖిలేశ్వర్. చిత్రంలో గుడిపాటి , భూపతి వెంకటేశ్వర్లు, జి. యాదగిరిరావు, తంగిరాల చక్రవర్తి



విజయనగరం సాహితీస్రవంతి ఆధ్వర్యంలో జూన్ 15న శ్రీశ్రీ వర్ధంతి సభలో రెడ్డి రామకృష్ణ దీర్ఘకవితా సంపుటి 'బీలా-భూమి-సముద్రం' హిందీ అనువాదం ఆవిష్కరణ సభ. చిత్రంలో వెలుగు రామినాయుడు, చీకటి దివాకర్, చాగంటి తులసి, ఎ.ఎన్. మల్లీశ్వరి, అనువాదకురాలు ఇనుగంటి జానకి, రెడ్డి రామకృష్ణ

## శ్రీమతి తురగా జానకీరాణి మేలిమి కథల పోటీ - 2015

శ్రీమతి తురగా జానకీరాణి స్మృత్యర్థం తురగా ఫౌండేషన్ 'చినుకు' మాసపత్రిక నిర్వహణలో కథల పోటీని నిర్వహిస్తున్నారు. 1) ఉత్తమ కథ - రూ. 7,500/-, 2) ద్వితీయ ఉత్తమ కథ - రూ. 5,000/-, 3) తృతీయ ఉత్తమ కథ - రూ.3,000/-, మూడు ప్రోత్సాహక బహుమతులు - ఒక్కొక్క కథకు రూ.1500/-, చొప్పున మూడు కథలకు రూ.4,500/-, మొత్తం బహుమతుల విలువ - రూ. 20,000/- రచయితలు డిటిపి చేసిన తమ కథలను పేజ్‌మేకర్ 7 లో ఓపెన్ ఫైల్ మరియు పిడియఫ్‌లో **editor.chinuku@gmail.com** కు మెయిల్ చేయవచ్చు. ఈ విషయం రాతపూర్వకంగా 'చినుకు' కార్యాలయానికి తెలియజేయగలరు.

## దాశరథి సంస్మరణ



దాశరథి రంగాచార్య మరణంతో మాక్సింగోర్కీ మరోసారి మరణించినట్లుందని పొట్టి శ్రీ రాములు తెలుగు విశ్వవిద్యాలయం మాజీ వైస్ ఛాన్సలర్ ఆచార్య ఎన్.గోపి అన్నారు. సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో నవ తెలంగాణ పబ్లిషింగ్ హౌస్ ఆధ్వర్యంలో జూన్ 12న తెలంగాణ సాయుధ పోరాట వీరుడు. అక్షర వాచస్పతి దాశరథి రంగాచార్య సంస్మరణ సభ జరిగింది. ఈ సందర్భంగా ఆచార్య ఎన్.గోపి మాట్లాడుతూ తెలుగు భాషలో అంత మధురంగా రాసిన రచయిత మరొకరు లేరన్నారు. ఆయన రాసిన మోదుగు పూలు, చిల్లర దేవుళ్లు, జనపదం తెలుగులో క్లాసిక్స్ అనదగిన రచనలు అని అన్నారు. సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి మాట్లాడుతూ దాశరథి రచనల్లో నిండా నింపుకున్న తెలంగాణ కనిపిస్తుందని అన్నారు. ప్రొఫెసర్ ఎస్వి సత్యనారాయణ మాట్లాడుతూ మట్టిమనిషిని ప్రేమించిన గొప్ప రచయిత దాశరథి అని కొనియాడారు. రచయిత నాళేశ్వరం శంకరం మాట్లాడుతూ తొలితరం ఉద్యమ నేతల్లో ఆయన గొప్ప శక్తివంతులని అన్నారు. తెలంగాణా రచయితల వేదిక అధ్యక్షులు జయధీర్ తిరుమల రావు మాట్లాడుతూ తెలంగాణ జనజీవనానికి తన అక్షరాలను అంకితం చేసిన గొప్ప వ్యక్తి అన్నారు. నవ తెలంగాణ పబ్లిషింగ్ హౌజ్ జనరల్ మేనేజర్ చంద్రమోహన్ అధ్యక్షతన జరిగిన ఈ కార్యక్రమంలో జూలూరి గౌరీశంకర్, ఎ. విద్యాసాగర్, ప్రముఖ రచయిత కృష్ణ కుమారి, నవ తెలంగాణా ఎడిటర్ ఎస్. వీరయ్య తదితరులు పాల్గొన్నారు.



పుష్యమి సాగర్ రచించిన "కొన్ని రాత్రులు" కవితా సంపుటి పుస్తక ఆవిష్కరణ హైదరాబాద్‌లో అబిడ్స్‌లోని 'గోల్డెన్ థ్రెసోల్డ్' లో జూన్ 20న జరిగింది. కార్యక్రమంలో బైసా దేవదాస్, డా॥ అమ్మంగి వేణుగోపాల్, ఎం.నారాయణ శర్మ, సురేష్, వాహెద్, యాకూబ్, డా॥ విరించి, కపిలరామ్ కుమార్ తదితరులు




కడప జిల్లా మైదుకూరులో జూన్ 2న కుందూ సాహితి నిర్వహించిన కవిత పోటీలో విజేతలకు బహుమతుల ప్రదానోత్సవంలో మాట్లాడుతున్న రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి.

**స్పందన**

## గొప్ప కవిత "చేతులు"

సాహిత్య ప్రస్థానంలో చాలా మంచి కవితలు ప్రచురింపబడుతున్నాయనటానికి తాజాగా డా.ఎన్.గోపి రచించిన "చేతులు" కవిత నిదర్శనం. డా.ఎన్. గోపి దగ్గర కవిత్వ పరుసవేది ఉందని కొత్తగా చెప్పక్కర్లేదు. చేతులపై ఇంత వరకు ఈ విధంగా కవిత్వం రాసిన వారు లేరనవచ్చు. 'పిడికిలి' పై కవితలు వచ్చాయి. శ్రమకి పర్యాయపదంగా, ఆసరాకి మరో పదంగా తిరుగుబాటుకి సమానార్థకంగా అభివ్యక్తి శిల్పంతో సాగింది "చేతులు" కవిత.

"చెయ్యి చెయ్యి కలిపితే/ కుటిలమేఘాలు / మెరుపు పగుళ్ళతో ముక్కలౌతాయి" అనటం సముచితంగా వుంది. "మెరుపు పగుళ్ళు" కొత్త పదబంధం, మహా కావ్యాలుగా ప్రశస్తి పొందినవైనా చేతులలోంచి వచ్చినవే కాబట్టి.

"అహో! చేతుల ముందు ఈ మహా కావ్యాలెంత?" అనడం ఔచిత్యంగా వుంది. మహాకావ్యాలు శాశ్వతంగా ఉన్నాయంటే అది చేతుల చలవే! ఒక మంచి కవితను చదివిన అనుభూతి పొందే అవకాశమిచ్చిన ఎన్.గోపికి, పత్రికా సంపాదకులకి అభివందనాలు.

డా.ద్వా.నా. శాస్త్రి, హైదరాబాద్

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,

# గుర్రం జాషువా

## 28.09.1895 - 24.07.1971



అట్టడుగు కులంలో పుట్టి అనేక అవమానాలు ఎదుర్కొని నిలబడ్డారు. 'గబ్బిలం' వంటి ఖండ కావ్యాలతో దళితుల హృదయవేదనను అద్భుతంగా ఆవిష్కరించారు. 'పిరదౌసి', 'కాందిశీకుడు', 'ముంతాజ్‌మహల్' వగైరా ఖండకావ్యాలు రాసి కవికోకిల, నవయుగ కవి చక్రవర్తి అని బిరుదులు పొందారు.

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVMOIA 161 |
| పుస్తకం పేరు | రేపస్తానం |
| తారీఖు | 25-5-24 |
| ముందు అట్ట | Yas |
| వెనుక అట్ట | Yas |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | K Daveed |
| పేజీలు విడదీసినది | K Daveed |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | GOOD |